వినదమ్
అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

సంపాదకవర్గం
సంపాదకుడు:
లయన్ కె.వి.గోవిందరావు బి.ఏ., ఎల్.ఎల్.బి.,
గౌరవ సహాయ సంపాదకులు :
టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్సి.,
వి.బాలకుమార్ ఎమ్.ఏ., బి.ఎల్.,
సభ్యులు :
కె.వి.ఎస్. శరత్‌బాబు బి.ఏ., బి.కాం., బి.ఎల్.
కె.వి.ఎస్. విజయకుమార్
కె. రత్నకుమారి

## చందావివరాలు

జీవితచందా............రూ॥ 350/-
3 సంవత్సరాల చందా..రూ॥ 85/-
సంవత్సర చందా.........రూ॥ 30/-
ఎయిర్ మెయిల్ (1సం॥) రూ॥ 125/-
సీ మెయిల్ (1సం॥)......రూ॥ 70/-

చందా పంపవలసిన చిరునామా

వినదమ్
9, దేశికారోడ్, మైలాపూర్
మద్రాస్-600004.
ఫోన్. 75926

## ఈ సంచికలో

మార్చి 1989

## ధ్యానం

# నిజతత్త్వం




నువ్వు ఉన్నట్టుగా నీవు ప్రవర్తించడం పవిత్రమైన ధర్మం. ఉన్నదాన్ని మరుగు చేసుకుంటూ ఇంకొకరిని అనుకరించాలనుకుంటే నువ్వు నీ వ్యక్తిత్వాన్ని నశింపజేసుకుంటున్నావు. ఇతరుల మెప్పుకోసం అనవసరంగా ఆరాటపడిపోతూ లేనిపోని కపట వేషాలు వేస్తూంటే మంచి ఏనాడూ కలుగదు. చెడు కలిగి తీరుతుంది. ఏదో తొడుగు ఎప్పుడూ ధరిస్తూంటే నిజతత్త్వం మరుగైపోతూంటుంది. సత్యమే స్థిరమైన నిజస్వరూపం. సత్యోపాసకుడవు కావాలి. సత్యోపాసకుడవు అయితే నీకు పరమపదం లభిస్తుంది.

కపటవేషాలు వేసే వంచకుడు లోకం కన్నులు ఎప్పుడూ మూయలేడు. జగత్తు మానవ కల్పితం కాదు. దానిని ఎవరూ మోసగించలేరు. ఏది

(మిగతా 10 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

# శాంతికి సక్రమ యోజన

శాంతిని ప్రణాళికాబద్ధం చేసుకుని సక్రమమైన యోజనలు వేసుకోవడం అనుకున్నంత సులభం కాదు. ఒక దేశం మరో దేశంతో విరోధాలు పెంచుకుని పోరాటానికి నిర్ణయించుకున్నప్పుడు ఆత్మరక్షణకు అనుకూలంగా లభించే సాధనాలన్నిటిని వినియోగించుకుంటూ సంసిద్ధమవుతుంది. ఇతర ఆలోచనలు ఉండవు. ఇతర ఉద్యమాలు చేపట్టదు. శాంతియోజనలను ఏర్పాటు చేసుకునేటప్పుడు అత్యల్ప విషయాలకు కూడా మిక్కిలి తీవ్రమైన వాదప్రతివాదాలు, ఆటంకాలు ఉద్భవిస్తాయి.

ఈనాడు శాంతి సమయంలో చేపట్టవలసిన సమస్యలు ఒకటా రెండా! ఏ నాటి కానాడు పెరిగిపోతూన్న జనాభా, ఎక్కడ చూసినా నిరుద్యోగత, అసంతృప్తి, భావికాలపు భయము, జాతీయ ఆదాయంలో అసమాన విభజన మొదలైనవి ఎన్నో. లోకంలో ప్రతీ దేశం దేని కదే పరిష్కారం చేసుకోవలసిన సమస్య లివి. శాంతి యోజనల పరిష్కారం ముఖ్యంగా అన్ని దేశాలకు తీవ్రమైన సమస్యలుగా పరిణమించాయి. విపరీతంగా జనాభా పెరిగిపోతూన్న ఆసియా దేశాలలో ఈ శాంతియోజనల అవసరం ఎంతైనా ఉంది.

ఇండియాలో జాతీయ పునరుద్ధరణకు, దేశప్రగతికి పంచవర్ష ప్రణాళికలు ఏర్పాటు చేయబడ్డాయి. భూములను దున్ని, వ్యవసాయ

"చెప్పింది మంత్రం కాదు. మననంలో మంత్రం అవుతుంది." —అమ్మ

కార్యక్రమాన్ని చేపట్టే కర్షకులనే భూమి స్వంతదారులుగా చేయుటద్వారా, కుటీర పరిశ్రమలను అభివృద్ధి చేయుటద్వారా, గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను చేపట్టుటద్వారా, ఆహార మరియు నార, ప్రత్తి మొదలగు వాటి ఉత్పాదనలో స్వయం సమృద్ధిని సాధించుటద్వారా, ఎరువులు, ఆటో



మొబియల్స్, రైళ్ళు, విమాన కర్మాగారాలను నెలకొల్పుట ద్వారా, భారీ పరిశ్రమలను చేపట్టుటద్వారా భారత ప్రభుత్వం సుస్థిరమైన ఆర్థికాభివృద్ధిని సాధించడానికి ఆశిస్తూంది.

దేశానికి అత్యవసరమైన విద్యుచ్ఛక్తి మరియు వ్యవసాయాభివృద్ధికి అవసరమైన నీటిపారుదల సమస్యలను తీర్చడానికి మన ప్రభుత్వం దేశంలో కీలకమైన పెద్ద పెద్ద డాములను, ఆనకట్టలను నిర్మించారు. దీని వల్ల దేశంలో వివిధ ఫాక్టరీలకు, గ్రామీణ ప్రాంతాలలో దీపాలకు కావలసిన విద్యుత్తును జనింపజేసి సరఫరా చేస్తున్నారు.

గ్రామీణ ప్రాంతాలలో కుటీరపరిశ్రమలు అచ్చటి ప్రజలకు కొంత విమోచనం కలిగిస్తున్నాయి ఇక పట్టణాలలోను, నగరాలలోను ఏర్పాటైన ఇండస్ట్రియల్ ఇన్సూరెన్స్ ప్రణాళికలు ప్రైవేటు పరిశ్రమలలో సిబ్బందికి లాభాలు కలిగిస్తున్నాయి.

శాంతి సమయంలో చేపట్టే ప్రణాళికాబద్ధమైన యోజనలు దేశ సౌభాగ్యానికి సహాయపడతాయి. దేశంలో యువత ఆత్మగౌరవానికి భంగం అని అనుకోకుండా కాయకష్టాలకు ఓర్చి పనులను చేపట్టినప్పుడు భారతదేశం సర్వోత్కృష్టమైనదిగా రూపొందుతుంది. శాంతియోజనలను పరిష్కరించుకుని సాధించుకోడానికి శ్రమపడి ఉద్యమించడం అవసరం.

శాంతి సమయంలో చేపట్టిన ఉద్యమాలు ఆర్థికాభివృద్ధికే కాదు, ధర్మాభివృద్ధికరంగా కూడా ఉండాలి. సమాజంలో ప్రబలిపోయిన అవినీతి నిర్మూలింపబడాలి. సోమరితనంతో నిద్రిస్తూన్న సమాజాన్ని మేల్కొల్పాలి. నిర్వ్యాజ్యమైన పరిశోధనంతో, నిర్భయమైన ఆత్మవిచారంతో, ప్రవృద్ధి చేసుకున్న వివేకంతో కానీ ఈ ఉద్యమాలు ఫలించవు.

శాంతి సమయపు యోజనలను, ప్రణాళికలను జపాను మిక్కిలి సామర్థ్యంతో అతి చాకచక్యంగా నైపుణ్యంగా పరిష్కరించుకుని సాధించింది. పూర్తిగా నశించిపోయిన ఆర్థిక పరిస్థితిని పునరుద్ధరించుకుని ప్రతీ రంగంలో

(మిగతా 6 వ పేజీలో)

**ప్రపంచంలో మిక్కిలి ప్రాచీనమైనది హిందూ మతం**

ప్రపంచంలో మిక్కిలి ప్రాచీనమైన మతం హిందూమతం. ప్రపంచంలో క్రైస్తవ మతాన్ని అనుసరించేవారు మిక్కిలి అధికం.

# మొట్టమొదటి పండుగ-ఉగాది

సీతారవిచంద్రన్

జీవితంలో కలిగే కష్టాలను ఓర్పుతో భరిస్తూ నిత్యనూతనోత్సాహంతో జీవితాని రుచిని కలిగించుకుంటూ జీవించగలగడమే ధైర్యవంతుల లక్షణం. జీవితాన్ని నిరాశ చేసుకోకూడదు. ప్రత్యాశతో, ముందు మంచిరోజు లున్నాయి అనుకుంటూ జీవించాలి. అందుకోసమే సంక్రాంతి, ఉగాది, శ్రీరామనవమి, వినాయక చతుర్థి, కృష్ణాష్టమి, దీపావళి మొదలైన పండుగలు; వాటితోపాటే పుట్టిన రోజులు, పెళ్ళిరోజులు, షష్టిపూర్తి సంబరాలు, సహస్ర చంద్ర దర్శనాలు, జయంతులు, వర్ధంతులు చేసుకుంటారు. ఇవే గాకుండా ఇప్పుడిప్పుడే సిల్వరు జూబిలీలు, గోల్డెన్‌జూబిలీలు, సంగీతోత్సవాలు, నాట్య ప్రదర్శనలు మొదలైన వాటిని కూడ ఏర్పాటు చేసుకుంటున్నారు. వీటిని జరుపుకోవడంవల్ల తాత్కాలికంగానైనా ఒకటి రెండు రోజులు హాయిగా ఉంటుంటాము.

మనం ఆచరించే పండుగలలో ముఖ్యమైనది, మొట్టమొదటిది సంవత్సరాది పండుగ. దీనినే ఉగాది అంటాం. యుగం అంటే ఒక ప్రత్యేక కాలపరిమితి; కాల విభాగం. ఈ కాలవిభాగానికి మొదలు_ఆది అదే యుగాది 'యుగాది' తెలుగు భాషలోకి వచ్చేటప్పటికి 'ఉగాది'గా వికృతి పొందింది. చంద్రమానాన్ని అనుసరించి చైత్రశుద్ధ పాడ్యమి రోజున క్రొత్త సంవత్సరం ప్రారంభమవుతుంది. సంవత్సరం అంటే 12 నెలల కాలవిభాగమే కదా. అందుచేత క్రొత్త సంవత్సరం ఆదిని ఉగాది అంటాం.

ఉగాది వస్తూందంటేనే ఎంతో సంబరం. ఎవరి ఇళ్ళు వాళ్ళు శుభ్రంచేసుకుని క్రొత్త రూపురేఖలు దిద్దుకుంటారు. పిల్లలు, పెద్దలు క్రొత్తబట్టలు కొనుక్కుంటారు. ముందే నిర్ణయించుకుని టివి, టుఇన్‌వన్, గ్రైండరు, మిక్సీ, ఫ్రిజ్ మొదలైనవి_ఎవరికి అవసరమైనవి వారు_కొనుక్కుంటారు. ఒక క్రొత్తదనం కల్పించుకుని ఆనందిస్తారు.

ఇక పండుగనాడు పొద్దున్నేలేచి తలంటుకుని స్నానంచేసి ఇంట్లో అందరూ కొత్త

భూమిమీద మిక్కిలి లోతైన మంచినీటి సరస్సు




సోవియట్ యూనియన్‌లో బైకాల్ సరస్సు ప్రపంచంలో మిక్కిలి లోతైన మంచినీటి సరస్సు.

''భావం తెలుసుకుని ప్రవర్తించేదే భార్య, ... తీసుకుని భరించేవాడే భర్త.'' —అమ...

బట్టలు ధరిస్తారు. గుమ్మాలకు పసుపుకుంకుమలు పెట్టి మామిడి తోరణాలు, వేపాకు తోరణాలు కట్టి ఇళ్ళముందు ముగ్గులు తీరుస్తారు. ఊరంతా ఒక క్రొత్త శోభతో నవచైతన్యంతో దేదీప్యమానంగా ఉంటుంది. దగ్గర బంధువులను సందర్శించి పరామర్శించుకుంటారు. పరస్పరం ఆనాడు సంవత్సరం పొడుగునా ఆయురారోగ్యాభివృద్ధులతో, సకల సంపదలతో వర్ధిల్లాలని అభినందించుకుంటారు. చిన్నవారు పెద్దవారికి సాష్టాంగ ప్రణామాలు ఆచరించి ఆశీర్వాదాలు పొందుతారు. దేవాలయాలని సందర్శిస్తారు. భగవంతుని దర్శనం చేసుకుని ప్రార్థనలు సలుపుతారు.

ఏనాడు పంచాంగం చూడనివారు కూడా ఆనాడు పంచాంగం కొని తెచ్చుకుంటారు. దానికి పసుపు కుంకుమలతో అలంకరించి పూజామందిరంలో పెట్టిపూజిస్తారు. పంచాంగంతోపాటు ప్రత్యేకంగా సంవత్సరాది దేవతను కూడా పూజిస్తారు. కులదేవతకు నైవేద్యాలు చేస్తారు. కుటుంబ ఆచారాన్ని బట్టి, అనువాయితీనిబట్టి ఇంటి ముందు ధ్వజం ఎత్తుతారు. ఒక వెదురుకు చివర పట్టుగుడ్డ వెండిచెంబు కట్టి దానిని మామిడి ఆకులతో, వేప ఆకులతో అలంకరించి పెరడులో ఇంటిముందు నిలబెట్టి దానికి పూజలు నైవేద్యం చేస్తారు. కొత్తగా దిగిన మామిడి పిందెల ముక్కలు, కొత్తబెల్లం, వేపపూవు, కొత్త చింతపండు, పచ్చిమిరపకాయ ముక్కలు, అరటిపండ్ల ముక్కలు, చెరకు రసం, గసగసాలు కలిపి షడ్రసోపేతంగా ఉగాది పచ్చడి తయారుచేసి దీనిని నైవేద్యం పెట్టి అందరూ ఆ ప్రసాదం తింటారు. ఈ పచ్చడిలో చేరిన రకరకాల రుచులే వాస్తవ జీవితంలో సుఖదుఃఖాలకు ఉపలక్షణం. తరువాత మధ్యాహ్నం పిండివంటలతో భోజనాలు చేస్తారు.

సాయంకాలం ఇంటిముందు చావడిలోనో, దేవాలయంలోనో నూతన పంచాంగ శ్రవణం చేస్తారు. ఎవరెవరి ఆదాయ వ్యయాలు, రాజపూజ్యావమానాలు వారు తెలుసుకుంటారు. ఈ విధంగా తెలుసుకోడం వల్ల ఎవరికి వారు తమ భావి జీవితాన్ని నిర్ణయించుకోడానికి వీలు కలుగుతుంది.

కొన్నిచోట్ల వినోదాలు, క్రీడలు, సంగీత కచేరీలు, నృత్యసభలు, నాటికలు, బుర్రకథలు ఏర్పాటు చేసుకుని వినోదిస్తారు. పశువుల పందాలు, కోళ్ళపందాలుకూడా నిర్వహిస్తారు.

### ఇటీవలి సొగసుకత్తెలు




ట్విగ్గీ, బ్రిగెట్టీ బార్డోట్, మార్లిన్ మన్రో, ఎలిజబెత్ టేలర్, రాక్వెల్ వెల్చ్.

"మైత్రి ప్రబలినకొద్దీ ఐక్యంకాగల ప్రవృత్తి ఏర్పడుతుంది."

యునైటెడ్ స్టేట్స్‌లోను మరియు ఇతర పశ్చిమతీరాలలో గ్రెగోరియన్ కాలెండరు అనుసరించి ప్రతి సంవత్సరం జనవరి 1వ తేదీన న్యూ ఇయర్స్ డే జరుపుకుంటారు. ప్రాచీన కాలంలో గ్రీకులు జూన్ 21 తరువాత అమావాస్య రోజున సంవత్సరాది చేసుకునేవారు. జూలియస్ సీజరు ముందు రోమనుల సంవత్సరాది మార్చి 1వ తేదీతో ప్రారంభమయ్యేది. మధ్యయుగపు కాలాలలో మార్చి 25 నుంచి ప్రారంభమయ్యేది. చైనా దేశస్థులు సంవత్సరాది పండుగ సంవత్సరంలో రెండుసార్లు చేసుకుంటారు. జనవరి 1వ తేదీన మరియు జనవరి, ఫిబ్రవరి నెలలలో ఎప్పుడో ఒకరోజున చేసుకుంటారు. ఈజిప్షియనులు జూన్‌లో చేసుకుంటారు. ఇండోనేషియాలో రెండుసార్లు సంవత్సరాదులు చేసుకుంటారు. రష్యాలో రష్యన్ ఆర్థోడాక్స్ చర్చివారు జూలియస్ సీజరు BC 45 లో ప్రవేశపెట్టిన జూలియన్ కాలెండర్ ప్రకారం జనవరి 14న ఆచరిస్తారు ఈ విధంగా ప్రపంచంలో వివిధ ప్రదేశాలలో, వివిధ రోజులలో సంవత్సరాదిని నిర్ణయించుకుని జరుపుకుంటారు. మనం చైత్రశుద్ధ పాడ్యమి రోజునే ఉగాది చేసుకుంటాము. ఇది సాధారణంగా ఏప్రిల్ మాసంలో వస్తుంది.

సృష్టికర్త అయిన బ్రహ్మ చైత్రశుద్ధ పాడ్యమినాడు సృష్టి ప్రారంభించినట్టు "చతుర్వర్గ చింతామణి" రచించిన హేమాద్రి చెప్పాడు. ఇది అందరికీ సమ్మతంగా లేదు, నమ్మరు. ఒకప్పుడు ఈ సంవత్సరాది ధనిష్ఠ కార్తెతో ఉగాది ప్రారంభమయ్యేది. రామాయణ కాలంలో మార్చి

## సూక్ష్మదర్శిని సహాయంతో 'మైక్రో సర్జరీ'



MICRO SURGERY

తెగిపోయిన కాళ్ళు, చేతులు, వ్రేళ్ళు మొదలైనవాటిని తిరిగి అతికించడానికి ఆస్ట్రేలియా, మరియు ఇతర అభివృద్ధి పొందిన దేశాలలో మైక్రోసర్జరీ అనుసరింపబడుతుంది. మైక్రోసర్జరీ ద్వారా శస్త్రవైద్యులు ధమనులను, నాళాలను నైపుణ్యంగా అతికిస్తారు. కంటికి శస్త్రవైద్యానికి కూడా దీనిని ఉపయోగిస్తారు. దాని ద్వారా శస్త్రవైద్యులకు వారు శస్త్రచికిత్స చేసే ప్రదేశం లోతు, పరిమాణం స్పష్టంగా తెలుస్తుంది.

(3 వ పేజీ తరువాయి)

ప్రవృద్ధిని, ప్రగతిని పొంది ఇతర దేశాలతో పోటీపడుతూంది. జాతీయ పునర్నిర్మాణానికి జపానువారు పగలు, రాత్రి అసాధ్యమైన కార్యక్రమాలను చేపట్టి నిర్విరామకృషితో బుద్ధికుశలతతో సమస్యలను నిర్విఘ్నంగా పరిష్కరించుకుంటున్నారు. ప్రపంచంలో నీతినియమం గల రాజ్యాంగ గౌరవప్రతిష్ఠలు పొందిన ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీకి ఆసియాలో జపాను ప్రతిరూపం.

"ధర్మకార్యముల పేరుతో పరుల ధనమును ప్రోగు

చెందిన వైశాఖ మాసంలో సంవత్సరారంభం అయింది. కౌత్యుడు హేమంతంతో సంవత్సరారంభమన్నాడు. అమరకోశంలో (అమరసింహుడు) మార్గశిర హేమంతాలను సంవత్సరాది అన్నాడు. ఈవిధంగా సంవత్సరాది ఆశ్వయుజం, కార్తికం, మార్గశిరం, పుష్యం, మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసాలలో మారుతూ వచ్చింది. కొందరు ఉత్తరాయణం, దక్షిణాయణం బట్టి కూడా సంవత్సరారంభం లెక్కకట్టారు. ఈ విధంగా సంవత్సరాది నిర్ణయం ఎన్నెన్నో మార్పులు పొందింది.

5 వ శతాబ్దానికి చెందిన వరాహ మిహిరుడు కొన్ని మార్పులు తీసుకువచ్చాడు. ఇతడు నెలకు, ఋతువుకు పొందిక కల్పించాడు. బ్రాహ్మణములలో విషువత్కాలం కృత్తికా నక్షత్రంలో సంభవించటం గమనించి అదే ఉత్తరాయణ పుణ్యకాలం అనే సాంప్రదాయంతో క్రొత్త సంవత్సరం వసంత విషువత్తు అని చైత్రమాసం అని నిర్ణయించాడు. వసంత విషువత్తు రోజున రాత్రి పగలు సమంగా ఉంటాయి. తరువాత భాస్కరాచార్యుడు తన "సిద్ధాంత శిరోమణి"లో చైత్రశుద్ధ పాడ్యమి సూర్యుని ఉదయంతో క్రొత్త సంవత్సరం, క్రొత్త మాసం, క్రొత్తదినం ఆరంభం అన్నాడు. ఆనాటినుంచి మనకు సంవత్సరాది మాసం నిర్ణయమైంది. మనకి నెలలు అమావాస్యతో మొదలయ్యేవి కొన్ని, పౌర్ణమితో ముగిసేవి కొన్ని. చంద్రుడు లేని అమావాస్య నుంచి చంద్రుని వృద్ధినిబట్టి లెక్కకట్టడం సులభం కాబట్టి శుక్లమాసం ఆలవాటైంది. చాంద్రమానం చాలా పురాతనమైంది. వైదిక కర్మలకు ఉత్తమమైనది. ధర్మశాస్త్రాలు ఒప్పుకున్నాయి.

ఈ చాంద్రమానాన్ని అనుసరించే మహారాష్ట్రులు కర్ణాటకాలో యుగాది (ఉగాది) జరుపుకుంటారు. తమిళం, బెంగాలి, సింధు, పంజాబు, అస్సాము సౌరమానాన్ని పాటిస్తారు. కాబట్టి వారి పండుగ మేషవిషువత్తును అనుసరించి వస్తుంది. గుజరాతీలు, మార్వాడీలు బార్హస్పత్యమానాన్ని అనుసరిస్తారు.

## పాబ్లోపికాసో చిత్రాల విలువ 750 మిలియను డాలర్లు




స్పానిష్ దేశంలో 20 వ శతాబ్దానికి చెందిన గొప్ప చిత్రకారుడు పాబ్లోపికాసో చిత్రాల విలువ 750 మిలియను డాలర్లు. 1967 లో ఇతడి 'టు బ్రదర్స్' మరియు 'సీటెడ్ హార్లెక్విన్' అనే చిత్రాలు రెండూ 19,50,000 డాలర్ల రికార్డు వెలకు అమ్మబడ్డాయి.

"స్వార్థపరులై కొందరు, స్వార్థత్యాగులై కొందరు

# మీకు తెలుసా?

**అంతరిక్షంలోకి వెళ్లిన మొట్టమొదటి ప్రాణి:**

1957 లో సోవియెట్ యూనియన్ అంతరిక్షంలోకి ప్రవేశింపజేసిన స్పుట్నిక్



II లో ప్రయాణంచేసిన లైకా అనే కుక్క అంతరిక్షంలోకి వెళ్ళిన మొట్టమొదటి ప్రాణి.

* * *

**ఎడ్గార్ రైస్‌బర్రోస్ టార్జాన్‌ను సృష్టించాడు:**

సుప్రసిద్ధ అమెరికన్ నవలా రచయిత ఎడ్గార్ రైస్ బర్రోస్ 'టార్జాన్ ఆఫ్ ది ఏప్స్ (1914) లో టార్జాన్‌ను సృష్టించాడు.

* * *

**'టియర్ గాస్'కి శాస్త్రీయమైన పేరు:**

'టియర్‌గాస్'ని శాస్త్రీయంగా క్లోరోపిక్రిన్ (Chloropicrin) అంటారు.

* * *

**భారత నౌకాదళానికి మొదటి భారతీయ నాయకుడు:**

భారత నౌకాదళానికి వైస్ అడ్మిరల్ ఆర్.డి. కటారి మొదటి భారతీయ నాయకుడు.

* * *

**చరిత్రలో చాలా కాలం జరిగిన యుద్ధం:**

చరిత్రలో (1338 - 1453) నూరు సంవత్సరాల యుద్ధం చరిత్రలో దీర్ఘకాలం జరిగిన యుద్ధం.

* * *

**దక్షిణ ధృవాన్ని చేరిన మొదటి భారతీయుడు:**

గిరి రాజ్ సింగ్ సిరోహి అనే భారతీయుడు మొట్టమొదట దక్షిణ ధృవాన్ని చేరాడు.

* * *

**'మోనాలిసా' సుప్రసిద్ధ పెయింటింగు:**

లియోనార్డో డా విన్సీ చిత్రించిన సుప్రసిద్ధ పెయింటింగు "మోనాలిసాను"ను 'లా గియోకోండా' (La Gioconda) అంటారు.

* * *

**వింబుల్డన్ టైటిల్‌ను గెలుచుకున్న మొదటి మహిళ**

వింబుల్డన్ (లాన్‌టెన్నిస్) టైటిల్‌ను గెలుచుకున్న మొదటి మహిళ మాడ్ వాట్సన్ (1884).

* * *

**నేపాల్‌లో అక్షరాస్యత:**

హిమాలయ ప్రదేశం నేపాల్‌లో అక్షరాస్యత రేటు మిక్కిలి తక్కువ.

"తల్లి తండ్రి సంబంధ బాంధవ్య బంధమువలె

# భారతరత్నాలు

## లాల్ బహదూర్ శాస్త్రి

లాల్ బహదూర్ శాస్త్రి భారతదేశపు రెండవ ప్రధానమంత్రి. గొప్ప న్యాయశీలుడు. మాటల చేతకాదు చేతలతో తన సామర్థ్యాన్ని నైపుణ్యాన్ని ప్రదర్శించాడు. మహోన్నత పదవిని అధిష్టించాడు. అకుంఠితమైన భక్తితో దేశసేవ చేసాడు. ప్రపంచానికి భారతదేశపు గొప్పతనాన్ని చాటి చెప్పాడు.



LALBAHADUR SHASTRI

లాల్ బహదూర్ ఉత్తరప్రదేశ్‌లో వారణాసి దగ్గర మొఘల్‌శరాయిలో అక్టోబరు 2, 1904 న జన్మించాడు. తండ్రి అలహాబాదు రెవిన్యూ ఆఫీసులో ఒక సాధారణ గుమాస్తాగా పనిచేస్తూండేవాడు. శాస్త్రికి ఒకటిన్నర సంవత్సరాలు నిండకముందే అకస్మాత్తుగా తండ్రి మరణించాడు. తాతగారు చేరదీసి పెంచారు. చిన్నతనంలో ఇతడిని 'నాని' అని ముద్దుగా పిలుస్తూండేవారు.

ఆరవ తరగతిలో ఉత్తీర్ణుడైన నాని చదువుకోడానికి వారణాసిలో ఉన్న మేనమామ దగ్గర చేరాడు. ఇక్కడ ఒక హైస్కూలులో ప్రవేశించాడు. తెలివిగల విద్యార్థిగా పేరుపొందాడు. ఇంగ్లీషు ఉచ్చారణ అతి స్వచ్ఛంగా ఉండేది. ఇతడు ఈతలో మంచి నిపుణుడు కూడా. సాయంకాలమప్పుడు హాకీ, ఫుట్‌బాల్ ఆటలు ఆడుతూండేవాడు. ఒకప్పుడు ఇంటికి వెళ్ళడానికి దగ్గర డబ్బు లేక గంగను ఈది ఇంటికి చేరాడు.

లాల్‌బహదూర్ పెరిగిన తరువాత దేశభక్తుల చరిత్రలు అభిలాషతో చదువుతూండేవాడు. లోకమాన్య బాలగంగాధర తిలక్ ఉపన్యాసం విని ఆశ్చర్యచకితుడై పోయాడు.

### 'విస్డమ్' పాత కాపీలు

ఫిబ్రవరి '83; మార్చి '84, మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచి నవంబరు '84; జనవరి '85, మార్చి '85 నుంచి అక్టోబరు '85; జనవరి '86 నుంచి డిసెంబరు '86; జనవరి '87 నుంచి డిసెంబరు '87; జనవరి '88 నుంచి జూన్ '88 కాపీలు మావద్ద ఉన్నవి. 1983 కాపీ వెల పై 0.75 లు; 1984 కాపీల వెల రూ. 8.75 లు; 1985 కాపీల వెల రూ. 11.50 లు; 1986 కాపీల వెల రూ. 18.25 లు; 1987 కాపీల వెల రూ. 19.00 లు; 1988 కాపీల వెల రూ. 10.00 లు. రిజిస్టర్డ్ పోస్టులో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 5.00 లు చేర్చి M.O. పంపాలి. 'విస్డమ్', 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004.

—సర్క్యులేషన్ మేనేజర్

"ముందు చూపు లేని మనుజుడు ఎంత

గాంధీ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించినప్పుడు పరీక్షలు వ్రాయకుండా ఆ ఉద్యమంలో చేరాడు.

ఆ తరువాత కొన్ని రోజులకు లాల్ బహదూర్ కాశీవిద్యాపీఠంలో విద్య కొనసాగించాడు. తత్త్వశాస్త్రం పఠించాడు. తత్త్వశాస్త్రంలో మొదటి శ్రేణిలో ఉత్తీర్ణుడయాడు. అప్పుడే ఇతడికి శాస్త్రి అనే బిరుదు ఇవ్వబడింది. అదే ఇప్పటికీ అతడి పేరు చివర ఉంటుంది.

స్వాతంత్ర్యోద్యమంలో బహదూర్ ఏడు పర్యాయాలు కారాగార శిక్షను అనుభవించాడు. చెరసాలలో ఇతడు మొత్తం 9 సంవత్సరాలు గడిపాడు. చెరసాలలో కూడా జైలు అధికారులు ఇతడి క్రమవిధానాన్ని ఎంతో మెచ్చుకున్నారు. ఇతడు చెరసాలలో ఉన్నంతకాలం ఇతడి కుటుంబం ఎంతో దారిద్ర్యబాధను అనుభవించింది.

1930 లో లాల్ బహదూర్ శాస్త్రి అలహాబాద్ జిల్లా కాంగ్రెస్ కమిటీకి జనరల్ సెక్రటరీగా ఎన్నుకోబడ్డాడు. తరువాత అధ్యక్ష పదవిని కూడా పొందాడు. దేశ స్వాతంత్ర్యానంతరం భారత జాతీయ కాంగ్రెస్ జనరల్ సెక్రటరీగా నియమింపబడ్డాడు. 1961 లో కేంద్ర మంత్రి మండలిలో హోమ్‌శాఖా మంత్రిగా ఎన్నుకోబడ్డాడు. అస్సాంలో ఇంగ్లీషు, అస్సామీస్, బెంగాలీ భాషలను ప్రవేశపెట్టి అస్సాంలో భాషా సమస్యను పరిష్కరించాడు. డిసెంబర్ 26, 1963 న శ్రీనగర్ హజరత్‌బాల్ మాస్క్ నుంచి ప్రాఫెట్ స్మారకచిహ్నంగా భద్రపరచిన వెంట్రుకలు అపహరింపబడినప్పుడు పెద్దఅలజడి రేగింది. లాల్‌బహదూర్

## వాల్ట్ డిస్నీకి 35 ఆస్కార్ అవార్డులు




మిక్కీమౌస్, డొనాల్డ్ డక్ వగైరాలను సృష్టించిన అమెరికన్ ఫిల్మ్ ప్రొడ్యూసర్ వాల్ట్ డిస్నీ 1931 మరియు 1969 సంవత్సరాల మధ్య ఉత్తమ ఫిల్ములకు 35 ఆస్కార్ అవార్డులు పొందాడు.

(2 వ పేజీ తరువాయి)

నీ లోపల ప్రకాశిస్తూందో అదే బయట ధర్మంగా రూపొందాలి. ఎన్ని వేషాలు వేసినా సృష్టిని మోసగించలేవు.

కృత్రిమ ప్రవర్తన చేత నిన్ను నీవే తప్ప ఇతరులను మభ్యపెట్టలేవు. కపటత్వానికి ప్రకృతి తగిన ఫలితాన్ని అనుభవింపజేస్తుంది. దుష్టులు, దుర్మార్గులు పూర్తిగా నిర్మూలించబడతారనేది సిద్ధాంతము. కృత్రిమ వేషధారణ వల్ల సహజత్వం నశించిపోతుంది. మానవుడు నశిస్తాడు. మాయామరీచకులు ఎండమావుల్లాగా ఏర్పడతాయి. లోకమనేది ఒక మహాయంత్రం. దానిలో నీ వొక చక్రం. అది ఎలాతిప్పితే అలా తిరుగుతావు.

అతి చాకచక్యంగా ప్రవర్తించి కాశ్మీరులో రక్తపాతం సంభవించకుండా శాంతిని నెలకొల్పాడు. కాశ్మీరు ప్రజల ప్రశంసలను అందుకున్నాడు. కేంద్ర ప్రభుత్వంలో హోమ్ శాఖామంత్రిగా ఉంటూ రాజ్యపాలనలోను, ఇతర ప్రభుత్వ సంస్థలలోను అవినీతిని నిర్మూలించడానికి సెంట్రల్ బీరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్‌ను నియమించాడు.

అంతకు ముందు రైల్వే మంత్రిగా ఉంటూ భారత రైల్వేల శక్తిసామర్థ్యాలను అభివృద్ధి చేశాడు. మూడవ తరగతి ప్రయాణీకులకు రైలు పెట్టెలలో నిద్రవసతులు ఏర్పాటు చేశాడు. బెర్తుల రిజర్వేషన్ విధానాన్ని అమలుపరచాడు. తిరిగి ట్రాన్స్‌పోర్టు కమ్యూనికేషన్స్ మంత్రిగా 1957 లో ఆంధ్రప్రదేశ్‌లో విశాఖపట్టణం దగ్గర నౌకా నిర్మాణ సంస్థను ఏర్పాటు కావించాడు. కామర్స్ మరియు పరిశ్రమల మంత్రిగా సోవియెట్ యూనియన్ మరియు చెకోస్లోవేకియా ప్రభుత్వ సహాయ సహకారాలతో బీహారు రాష్ట్రం రాంచీలో హెవీ మెషినరీ ప్రాజెక్టును స్థాపింపజేశాడు. ఒక ఫ్రెంచి కంపెనీ సహకారంతో తమిళనాడు నీలగిరి దగ్గర ఉదకమండలంలో 'రాఫిల్మ్ ఫాక్టరీని' స్థాపించాడు.

లాల్‌బహదూర్ శాస్త్రి క్లిష్ట పరిస్థితులను చేపట్టడంలో, రాజీలు కుదర్చడంలో మంచి నిపుణుడు. సుప్రసిద్ధ వైజ్ఞానిక శాస్త్రవేత్త మాడంక్యూరీ బయోగ్రఫీని హిందీ భాషలోకి అనువదించాడు.

నెహ్రూ మరణానంతరం 18 మాసాల పాటు మాత్రమే శాస్త్రి ప్రధానమంత్రి పదవిని అధిష్టించాడు. ధైర్యసాహసాలతో అనేక క్లిష్ట సమస్యలను అవలీలగా సాధించాడు. 1965 లో పాకిస్థాన్ యుద్ధంలో శాస్త్రి ఉత్సాహం, ప్రోత్సాహం కలిగించి భారతదేశానికి విజయం సాధించాడు. సోవియెట్ యూనియెన్ తాష్కెంట్ డిక్లరేషన్ ఇచ్చిన తరువాత జనవరి 11, 1966 న గుండెపోటువల్ల మరణించాడు.

ప్రధాన మంత్రిగా దేశంలో మిక్కిలి గౌరవాన్ని సంపాదించాడు. ఇతని నిరాడంబరత్వానికి, న్యాయశీలతకి ప్రజలు ఆశ్చర్యపడిపోయేవారు. వాదప్రతివాదనలు చేయడం ఇతని మతం కాదు. ఇదే ఇతడి గొప్ప విశేషం. ఇతడి జీవితం మిక్కిలి గౌరవప్రదమైనది.

## గుడ్లగూబ మెడను వర్తులాకారంలో త్రిప్పగలదు



రాత్రిపూట సందడిగా ఆహారం కోసం సంచరించే గుడ్లగూబ కళ్ళు కదపలేకపోయినా మెడను పూర్తిగా వర్తులాకారంలో త్రిప్పగలదు.

# ఫతేపూర్ సిక్రీలో మొగలాయీల వైభవం

రాఘవేంద్రరావు

ఆగ్రాకు 40 మైళ్ళ దూరంలో ఎండలో మండిపోతూన్న విశాల మైదానప్రదేశంలో ఫతేపూర్ సిక్రీ ఇసుకరాతి కొండపైన లేచింది.

కొద్ది కాలంపాటు ఇది మొగలాయి చక్రవర్తి అయిన అక్బరు రాజధానిగా ఉండేది.



FATEHPUR SIKRI

ఇచ్చటి రాజభవనాలు, ఇతర బ్రహ్మాండమైన కట్టడాలు మొగలాయీల శక్తి సామర్థ్యాలను, నైపుణ్యాన్ని మహాద్భుతంగా చాటుతూంటాయి.

అక్బరు చక్రవర్తికి జ్యోతిష్కుడుగా ఉన్న ఒక సూఫీ భక్తుడు షెక్ సలీమ్ చిస్తీ జ్ఞాపకార్థంగా ఫతేపూర్ సిక్రీని అక్బరు నిర్మించినట్టు చెబుతారు. అక్బరుకు ముగ్గురు కుమారులు పుడతారని ముందుగా ఇతడు భవిష్యత్తు చెప్పాడు. అక్బరు ఈ ప్రదేశానికి వచ్చినపుడు 96 సంవత్సరాల ముసలి ఈ సూఫీ భక్తుడు సిక్రీ కొండమీద ఒక గుడిసెలో కాపురం చేస్తూండేవాడు.

మహారాణి జోదాబాయి ఒక పిల్లవాణ్ణి ప్రసవించిన వెంటనే అమిత సంతోషంతో అక్బరు ఆ పిల్లవాడికి సలీమ్ అని ఆ భక్తుని పేరుపెట్టడమే కాకుండా అతను నివసించే చోట ఒక పెద్ద రాజధాని నగరాన్ని నిర్మించడానికి నిర్ణయించుకున్నాడు

రాజధాని నిర్మాణం 1569 లో ప్రారంభమైంది. 11 కి మీ. వైశాల్యం చుట్టూ పెద్ద పెద్ద గోడలు లేచాయి. లోపల బ్రహ్మాండమైన సభాస్థలాలు, గుర్రపుశాలలు, బజారులు, మిలటరీ వసతులు, పెద్ద పెద్ద మాస్కులు నిర్మింపబడ్డాయి. నీటివసతికి ఒక పెద్ద సరస్సుకూడా త్రవ్వబడింది.

పూర్తిగా ఎర్రరాతితో కట్టబడిన ఈ భవనాలు హిందూ మరియు ముస్లిం శిల్పకళతో అలరారుతూంటాయి. అక్బరు చక్రవర్తి ఆశించిన హిందూ ముస్లిమ్ సమైక్యతకు ఇది చిహ్నంగా ఉంది.

ఫతేపూర్ సిక్రీలో మిక్కిలి బ్రహ్మాండమైన నిర్మాణం పెద్ద మసీదు. గుజరాత్‌లో యుద్ధంచేసి విజయం పొందిన సిమ్మృతి ఇచ్చటకు వచ్చి మసీదు బులాండ్ దర్వాజాను నిర్మించాడు.

జోదాబాయి భవనము, బీర్బల్ నివాస గృహం కూడా ఇక్కడ చూడవచ్చు. అయిదు అంతస్తుల సూచీ ఆకారపు నిర్మాణము, పంచ మహల్ బౌద్ధుల విహారములను అనుసరించి నిర్మింపబడింది. తెల్ల పాలరాతిలో నిర్మింపబడిన షైక్ సలీమ్ చిస్తీ సమాధి ఎంతో అద్భుతంగా ఉంటుంది. 1572 లో చిస్తీ మర

(మిగతా 47 వ పేజీలో)

# ప్రపంచంలో పార్లమెంట్లు

| | | |
|---|---|---|
| అఫ్ఘనిస్థాన్ | — | షోరా |
| అర్జెంటీనా | — | నేషనల్ కాంగ్రెస్ |
| బంగ్లాదేశ్ | — | జాతీయో సంగ్‌సాద్ |
| బ్రెజిల్ | — | నేషనల్ కాంగ్రెస్ |
| బ్రిటిష్ పార్లమెంటు | — | హౌస్ ఆఫ్ కామన్స్ మరియు హౌస్ ఆఫ్ లార్డ్స్ |
| చైనా | — | నేషనల్ పీపుల్స్ కాంగ్రెస్ |
| పశ్చిమ జర్మనీ | — | బుండెస్టాగ్ |
| ఐస్‌లాండ్ | — | ఆల్‌థింగ్ |
| భారతదేశం | — | సన్‌సాద్ |
| ఇరాన్ | — | మజ్‌లిస్ |
| జపాన్ | — | డయట్ |
| మంగోలియా | — | గ్రేట్ పీపుల్స్ ఖురాల్ |
| నేపాల్ | — | రాష్ట్రీయ పంచాయత్ |
| నార్వే | — | స్టార్‌టింగ్ |
| పాకిస్థాన్ | — | నేషనల్ అసెంబ్లీ సెనేట్ |
| స్పెయిన్ | — | కోర్‌టెస్ |
| స్వీడెన్ | — | రిక్స్‌డాగ్ |
| యుఎస్ఏ | — | కాంగ్రెస్ |
| యుఎస్ఎస్ఆర్ | — | సుప్రీమ్ సోవియెట్. |

## ప్రపంచంలో మిక్కిలి వింత జంతువు


PLATYPUS

2 అడుగుల పొడవుగల ఆస్ట్రేలియా ప్లాటిపస్ (platypus) ప్రపంచంలోనే మిక్కిలి వింతైన జంతువు. ఇది పక్షిలాగ గ్రుడ్లను పెడుతుంది. దీనికి బాతు ముక్కువంటి ముక్కు ఉంటుంది. బీవర్ తోకవంటి తోక ఉంటుంది. చేపలాగా నీటిలో ఈదుతుంది. ఆస్ట్రేలియాలో మాత్రమే నివసించే ఈ జంతువు ప్రపంచంలో మిక్కిలి ప్రాచీన క్షీరదము.

''అతిపరుషమైన మానవప్రగతికి నాజూకుతనం,

# అవీ - ఇవీ

**3,000 ముత్యాలు కనుగొనబడ్డాయి:**

స్పెయిన్‌లో 400 సంవత్సరాలనాటి గ్రామంలో శిధిలాలను పరిశోధిస్తూండగా డా. జోసెఫ్ ఎమ్ క్రక్సెంట్ 3,000 ముత్యాలను కనుగొన్నాడు. 3,00,000 డాలర్ల విలువచేసే ప్రకాశవంతమైన ఈ ముత్యాలు భూమిలో 2 అంగుళాలలోతున దొరికాయి.

**ప్రపంచంలో మొట్టమొదటి మంకీబాయ్:**

ప్రపంచంలో కోతులు పెంచిన మొట్ట మొదటి బాలుడు "మంకీబాయ్" 1975 లో ఆఫ్రికా బారుండీలో ఉన్నట్టు కనుగొనబడ్డాడు. కోతులు పెంచిన 6 సంవత్సరాల ఈ బాలుడు నాలుగు కాళ్ళమీద కోతులలాగే నడుస్తాడు. మాట్లాడలేడు.

**కాఫీకి పాలు పంచదార కలిపిన మొదటి వ్యక్తి:**

1683 లో పోలండ్ ప్రయాణీకుడు ఫ్రాన్జ్ జియోగ్ కోల్‌షిట్‌స్కీ ఆస్ట్రియా వియన్నాలో ఒక కాఫీ హోటలును స్థాపించాడు. ఇతడే మొట్టమొదట కాఫీలో పాలు పంచదార కలిపి వాడిన వ్యక్తి.

**ఆవులకు కృత్రిమ దంతాలు:**

యుఎస్ఎలో వార్డ్ మ్యూ కోంట్‌లో కొలరోడో రాంచెర్ రూడ్‌మెంటర్ మరియు నెబ్రాస్కా అనే దంతవైద్యులు ఆవులకు కృత్రిమదంతాలను అభివృద్ధి చేసారు. ఆవులు సాధారణంగా గడ్డితోపాటు రాపిడి కలిగించే వస్తువులను తినేటప్పుడు ముందు దంతాలు అరిగిపోతాయి. అందుచేత వాటి జీవితకాలం తగ్గిపోతూంది. స్టెయిన్‌లెస్ స్టీలు తొడుగులతో కృత్రిమదంతాలు అభివృద్ధిచేసి వాటి జీవితాన్ని వీరు పొడిగించారు. ఈ విధంగా అమూల్యమైన మంచిరకం ఆవులు బాగా అభివృద్ధి చెందడానికి అవకాశం కలిగించారు.

**భారతదేశంలో మిక్కిలి ఎత్తుమీద ఉన్న విమానాశ్రయం:**

సిమ్లా దగ్గర జుబ్బార్‌హట్టీ వద్ద సముద్ర మట్టానికి 5,100 అడుగుల ఎత్తున అనోకి డాలి స్పర్‌లో ఇటీవల నిర్మింపబడిన విమానాశ్రయం భారతదేశంలో మిక్కిలి ఎత్తు మీద ఉంది.

**ఇస్తాంబుల్ పాత రాజమందిరంలో 353 పడకగదులు చావడులు:**

ఇస్తాంబుల్‌లో తురుష్క చక్రవర్తులకు చెందిన టోప్‌కాపీ పాత రాజమందిరంలో 17 గ్రంథాలయాలు, 22 జలయంత్రాలు, 353 పడకగదులు, చావడులు, 12 మసీదులు, 12 స్నానాల గదులు, 2 మందుల దుకాణాలు, 2 హాస్పిటళ్ళు, 5 పాఠశాలలు, 5 డార్మిటరీలు ఉన్నాయి.

**శాంతాక్లాస్‌కు ప్రతిరూపం:**

శాంతాక్లాస్‌కు సోవియెట్ యూనియన్ వారి ప్రతిరూపం గ్రాండ్‌ఫాదర్ ఫ్రాస్ట్

నూతన సంవత్సరం సందర్భంగా వస్తాడు. ఇతనితోపాటు స్నో మెయిడెన్ ఇతడి మనుమరాలు కూడా అలంకరించుకుని వస్తుంది. ఈ పౌరాణిక వ్యక్తులు లేకుండా సోవియెట్ యూనియన్ శీతాకాలం ప్రారంభించదు. ఇప్పటి పిల్లలు ఇంకా వీరి అద్భుత శక్తులను నమ్ముతారు.

—'సోవియెట్ లైఫ్' సౌజన్యంతో

**అంతర్జాతీయ లెటర్ రైటింగ్ పోటీలో మొదటి బహుమానం:**

1987 లో స్విట్జర్లాండ్‌లోని బెర్నే వరల్డ్ పోస్టల్ సెంటర్, యునైటెడ్ నేషన్స్ ఎడ్యుకేషనల్ సైంటిఫిక్ అండ్ కల్చరల్ ఆర్గనైజేషన్‌వారు చేరి ఉమ్మడిగా నిర్వహించిన అంతర్జాతీయ ఉత్తరాల వ్రాత పోటీలో తమిళనాడు (తరంగంబాడి) ట్రాన్క్విబార్‌కు చెందిన లక్ష్మి అనే 6 వ తరగతి విద్యార్థిని మొదటి బహుమానాన్ని గెలుచుకుంది.

**మిక్కిలి పెద్ద లాండింగ్ ఓడ భారతదేశంలో నిర్మింపబడింది:**

భారతదేశంలో మిక్కిలి పెద్ద లాండింగ్ ఓడ ఐఎన్ఎస్ మాగార్ రూ. 30 కోట్ల ఖర్చుతో నీటిమీద, నేలమీద ఉపయోగించుకునేటట్టు నిర్మింపబడింది. ఇది పైన్యాన్ని ఎక్కడ కావాలంటే అక్కడ సునాయాసంగా దింపుతుంది. దీని అధునాతన సౌకర్యాలలో క్లోజ్డ్ సర్క్యూట్ టివి ఒకటి.

**ప్రపంచంలో ట్రాక్టర్లను అధికంగా ఎగుమతిచేసే దేశం:**

ప్రపంచంలో బ్రిటన్ ట్రాక్టర్లను అధికంగా ఎగుమతి చేస్తుంది. ఇటీవల బ్రిటన్‌లో మాస్సె పెర్గూసన్ కంప్యూటర్ విధానాన్ని అభివృద్ధి చేసింది. వీరు తయారుచేసే 3000 సీరీస్ ట్రాక్టర్లకు ఆటోమాటిక్ కంప్యూటర్ సౌకర్యాన్ని కల్పించింది. డ్రైవర్ ట్రాక్టరును నడుపుతూంటే తక్కిన పని అన్నీ కంప్యూటర్ నూతన విధానం చూసుకుంటుంది.

**పని ప్రార్థనతో సమానం**



లాల్‌బహదూర్ శాస్త్రి భారతదేశానికి ప్రధానమంత్రిగా ఎన్నుకోబడినప్పుడు అతడి ముసలితల్లి 'లాల్‌బహదూర్ అవసరమైతే దేశాభివృద్ధికి జీవితాన్ని కూడా ధారపోసి సేవ చేస్తాడనుకుంటా' అంది. తల్లి ఆశించినట్లే శాస్త్రి నడుచుకున్నాడు. అనారోగ్యంతో బాధపడుతున్న 61 సంవత్సరాల వృద్ధుడు రోజుకు 17 గంటలు నిర్విరామంగా కృషి చేసేవాడు. ఏ నాటి పని ఆనాడు పూర్తి చేసేవాడు. 'పని ప్రార్థనతో సమాన'మని శాస్త్రి దృఢ అభిప్రాయం.

# క్రికెట్‌కు సంబంధించిన మాటలు

**కవర్ పాయింట్:** వికెట్‌కు ముందు ఫీల్డరు ఉండే చోటు.

**డ్రైవ్:** బౌలర్ ఉన్న వైపు బాట్స్‌మన్ సరాసరిగా కొట్టినప్పుడు బంతి క్రింద పడి దొర్లితే.



**డక్:** పరుగులు తీయకుండా బాట్స్‌మన్‌ని తొలగించినప్పుడు

**ఫాలో ఆన్:** స్కోరు చాలా తక్కువగా ఉండడంవల్ల బాటింగ్ టీము రెండవ ఇన్నింగ్సును ప్రారంభించమని కోర బడుతుంది. అటువంటప్పుడు ఎక్కువ పరుగులు తీసిన టీముకి అధమం 200 పరుగుల మార్జిన్ ఉండాలి.

**హాట్ ట్రిక్:** బౌలర్ వరుసగా ముగ్గురు బాట్స్‌మన్‌లను తొలగించినప్పుడు.

**హిట్ వికెట్:** బాట్స్‌మన్ తన క్రీజ్‌లో ఉండగా తన శరీరం గాని, బాట్ గాని వికెట్లకు తగిలినప్పుడు హిట్ వికెట్ ఔట్ అంటారు.

**లెగ్ బిఫోర్ వికెట్ (LBW):** తన శరీరంలో ఏ భాగంతోనైనా బంతిని వికెటుకు తగలనీయకుండా బాట్స్‌మన్ నివారించినప్పుడు ఆటగాడిని LBW ఔట్ అంటారు.

**మెయిడెన్ ఓవర్:** 6 బంతుల ఓవర్‌లో బౌలర్ పరుగు లేకుండా చేసినప్పుడు.

**రన్ ఔట్:** బాట్స్‌మన్ పరుగు తీయడానికి తన క్రీసును వదిలినప్పుడు ఆ సమయంలో ఫీల్డర్ బంతి పట్టుకుని వికెట్‌ను కొట్టినప్పుడు బాట్స్‌మన్‌ని 'రన్ ఔట్' అంటారు.

**రబ్బర్:** ఒక టీము ఓడిన దానికంటే అధికంగా మాచ్‌లను గెలిచినప్పుడు టీము 'రబ్బర్' గెలిచింది అంటారు.

**టెస్ట్ మాచ్:** రెండు దేశాల ఉత్తమ టీముల మధ్య జరిగే మొదటి తరగతి మాచ్‌లు.

—'న్యూ హైట్స్' సౌజన్యంతో

## ముఖచిత్ర వ్యాఖ్య

(జనవరి 1989)

"చిన్నారి బాలల వెక్కిరింత
చూసినవారికి చక్కిలిగింత."

—పి. జగదీష్, విశాఖపట్నం.

• • •

"పెం పెం బోయే సమాజానికి
బాలలే వికాసానికి వెలుగులు."

—కర్రి కృష్ణమ్మ, పిఠాపురం.

"ఉన్నవాళ్ళ బాగోగులు అందరి పూరము ననుసరించి

# కప్పలు - గోదురు కప్పలు

టి.ఎస్.ఎన్. మూర్తి

భారతదేశంలో సుమారు 140 రకాల ఉభయచరాలు (నీటిలోను, భూమిమీద చరించేవి) జీవిస్తున్నాయి. అపురూపమైన క్రిమివంటి సెసీలియనులు (Caecilians), బల్లులవంటి న్యూయెట్సు (Newts), సాధారణ కప్పలు, గోదురు కప్పలు ఉభయచరాలలో చేరినవి.

సర్వసాధారణమైన నీటి కప్పను స్కిప్పింగ్ ఫ్రాగ్ అంటారు. నీటిలో మునిగే ముందు ఇవి నీటి ఉపరితలంమీద



FROG

గెంతుతాయి. గ్రీన్ ఫ్రాగ్ (ఆకుపచ్చ కప్ప) పచ్చని ఆకుల ఆకుపచ్చని రంగులో ఉంటుంది. ఇవి మామూలు పాచి, ఇతర నీటి కలుపు మొక్కలతో నిండిన చెరువులలోను, ఆవలలోను నివసిస్తాయి.

ఇండియన్ బుల్ ఫ్రాగ్ 7 అంగుళాల పొడవు పెరుగుతుంది. ప్రత్యేకమైన దాని పెద్ద పరిమాణం వల్ల, గట్టిగా అరవడంవల్ల, మంచి బలంవల్ల దానికా పేరు సార్థకమైంది.

ఇతర సాధారణమైన కప్పలు చిన్నచిన్న పురుగులను, కీటకాలను తింటాయి. కాని ఇవి ఏవి కనిపిస్తే వాటిని మ్రింగివేస్తాయి. చేపలు, పీతలు, బల్లులు మొదలైనవాటినే గాక చిన్న పాములను, పిల్ల తాబేళ్ళను, ఎలుకలను కూడా సులభంగా మింగేస్తాయి.



GREEN FROG

## ప్రపంచంలో అధిక జాతీయ ఆదాయానికి జపానుది ద్వితీయస్థానం

ఇప్పుడు యుఎస్ఎ తరువాత మిక్కిలి పెద్ద జాతీయ ఆదాయానికి జపానుది ద్వితీయ స్థానము. 1986 లో వీరి తలసరి ఆదాయం అమెరికనుల తలసరి ఆదాయాన్ని మించిపోయింది. అమెరికనులది డాలర్లు 16,000 ఉంటే, వీరిది 17,000 డాలర్లు. 1965 లో జపాను తలసరి ఆదాయం అమెరికా తలసరి ఆదాయంలో నాల్గవ వంతు.

— 'ప్లెయిన్ ట్రూత్' సౌజన్యంతో

సాధారణ ఇండియన్ టోడ్ (గోదురు కప్ప)కి శరీరం అంతా ముళ్ళుతేరి ఉంటుంది. భుజాలు బాగా ముందుకు ఉబ్బుకుని ఉంటాయి. దీనిని బెదిరించినప్పుడు తెల్లని పాలవంటి పదార్థాన్ని విసర్జిస్తుంది. ఇదే దానికి రక్షగా ఉపయోగపడుతుంది.



BULL FROG

ట్రీఫ్రాగ్ (చెట్టు కప్ప) కాలివేళ్ళకు, చేతి వేళ్ళకు చిన్న చిన్న పళ్ళెలలా ఉంటాయి. ఈ కప్పలే సాధారణంగా మన ఇళ్ళలోకి జొరబడుతూంటాయి.

చీమలను తినే సన్న మూతి కప్ప (Narrow mouthed Frog) అంత ఎక్కు-



TOAD

వగా కనిపించదు. బెలూన్ కప్ప సాధారణంగా తోటలలో కనిపిస్తూంటుంది.

కప్పలు, గోదురు కప్పలు జీవావరణ సమతౌల్యతకు తోడ్పడతాయి అంటే ఆశ్చర్యంగానే కనిపిస్తుంది. ఇవి ముఖ్యంగా ఇతర జంతువులకు కావలసినప్పుడు తినడానికి వాటికి ఆహారంగా ఉపయోగపడే బఫర్



TREE FROG

స్టాక్. చాలామటుకు కీటకాలను, పురుగులను ఇవి తింటాయి. ప్రకృతిలో వీటి



NARROW-MOUTHED FROG

ప్రాముఖ్యతను గ్రహించి ప్రభుత్వమువారు కప్పలకు సంబంధించిన మాంసం ఎగుమతులను నిషేధించారు.

## బెంగుళూరులో అత్యధికంగా ఆత్మహత్యలు

భారతదేశపు నగరాలలో బెంగుళూరులో అత్యధికంగా ఆత్మహత్యలు - సంవత్సరానికి సుమారు 1000 జరుగుతున్నాయి.

# వీరిని గురించి తెలుసుకోండి

**బహదూర్ షా జాఫర్ (1775-1862):**

మొగల్ సామ్రాజ్యాధిపతులలో చివరి చక్రవర్తి. కానీ ఇతడి అధికారము ఎర్ర కోట (లాల్‌ఖిల్లా) నాలుగు గోడలను




దాటి ఉండలేదు. మొదటి స్వాతంత్ర్య యుద్ధము (1857 సిపాయిల తిరుగుబాటు) తరువాత బ్రిటిష ప్రభుత్వాన్ని ఎదిరించాడనే నేరంమీద శిక్షింపబడి రంగూను (బర్మా)కు వెళ్ళగొట్టబడ్డాడు.

* * *

**చక్రవర్తి విజయరాఘవాచారి:**

సాధారణ పేదకుటుంబంలో జన్మించాడు. న్యాయవాదిగా గొప్ప పేరు, ప్రసిద్ధులు పొందాడు. 1919 లో ఇతడు ప్రాతిపదిక హక్కులపై ఒక తీర్మానాన్ని ప్రతిపాదించి భారత జాతీయ కాంగ్రెస్ అంగీకారమును పొందాడు. ఈ తీర్మానమే భారత స్వాతంత్ర్య రాజ్యాంగమునకు ప్రాతిపదిక.

* * *

**వెర్రీర్ ఎల్‌విన్ (1903-1964):**

ఇంగ్లండులో ఒక క్రైస్తవ మతాచార్యుని కుటుంబంలో జన్మించాడు. ఇతడు మహాత్మాగాంధీ బోధనలకు ప్రేరితుడై భారతీయుడుగా మారాడు. అటవికుల అభివృద్ధికి పాటుపడుతూ మధ్యప్రదేశ్‌లో వారికి అనేక పాఠశాలలు నెలకొల్పాడు. అటవికుల సమస్యలను గురించి ప్రభుత్వానికి సలహాదారుడుగా నియమింపబడ్డాడు. భారతదేశంలో అటవికుల మనుగడకు ఒక స్థానాన్ని సంపాదించాడు.

* * *

**అడ్మిరల్ జయంత్ గనపత్ నాద్‌కర్ణి:**

ముఖ్య నౌకాధికారి. యునైటెడ్ స్టేట్స్ నావల్‌వార్ కాలేజీ మరియు నీలగిరి వెల్లింగ్‌టన్ డిఫెన్స్ సర్వీసెస్ స్టాఫ్ కాలేజీలో ఇతడు పట్టభద్రతను పొందాడు.

* * *

**విక్రమ్ దేవవర్మ (1869-1951):**

విశాఖపట్టణంలో జయపుర సంస్థానాధీశ్వరులకు సన్నిహిత జ్ఞాతుడు. 1930 లో జయపురాధీశ్వరుడు నిస్సంతుగా చనిపోవుటచే వారసత్వరీతిని ఆ సంస్థానము ఇతడికి సంక్రమించి జయపురమునకు జమిందారు అయ్యాడు. మాతృభాష ఓఢ్ర (ఒరియా) మైనను అభిమానంతో ఆంధ్రభాషను అభ్యసించి అందులో అపార పాండిత్యం సంపాదించి అనేక కావ్యాలు రచించాడు. ఇతడికి

(మిగతా 52 వ పేజీలో)

# నిజాలు - నిదర్శనాలు

## ఉత్తర అమెరికాలో ప్రతి ఇద్దరికి ఒక టెలిఫోను:

ఉత్తర అమెరికా నివాసులలో ప్రతి ఇద్దరికి ఒక టెలిఫోను ఉంది. ఆఫ్రికాలో ప్రతీ 100 మందికి ఒక టెలిఫోను ఉంటే, భారతదేశంలో ప్రతీ 200 మందికి ఒక టెలిఫోను ఉంది. ప్రపంచం అంతా ఉన్న టెలెక్స్ సర్వీస్ సౌకర్యాన్ని 1 7 మిలియను మంది వినియోగించుకుంటున్నారు.

* * *

## షెడ్యూల్డు కమర్షియల్ బాంకులలో డిపాజిట్ల పెరుగుదల 15.6 శాతం:

షెడ్యూల్డు కమర్షియల్ బాంకుల డిపాజిట్లు 1987 లో 15.6 శాతం పెరుగుదలను సూచించాయి. పబ్లిక్ రంగంలో 18,000 మంది జనాభాకి ఒక్క బాంకు ఉంది.

* * *

## భారతదేశం చేనేత ఉన్ని తివాసీలను అధికంగా ఎగుమతి చేస్తుంది:

ఇప్పుడు చేనేత ఉన్ని తివాసీలను భారతదేశం అధికంగా ఎగుమతి చేస్తూంది. ప్రపంచ మార్కెట్‌లో భారతదేశం వంతు 19.15 శాతం. తరువాత వరుసగా ఇరాను 17.10 శాతం, చైనా 16 శాతం, పాకిస్థాన్ 14.69 శాతం ఎగుమతి చేస్తున్నాయి.

* * *

## తలసరి GNP కి జపానుది ప్రథమస్థానం:

తలసరి మొత్తం జాతీయ ఉత్పాదనకు (GNP)1987 లో యునైటెట్ స్టేట్స్‌ను జపాను అధిగమించి ఆర్థిక సహకార మరియు అభివృద్ధి సంస్థకు చెందిన 24 దేశాల సభ్యత్వంలో స్విట్జర్లాండ్ తరువాత ద్వితీయ స్థానాన్ని పొందింది. జపాను తలసరి GNP విలువ 19,600 డాలర్లు. యుఎస్‌ఎ ది 18 400 డాలర్లు. 20,000 డాలర్లతో స్విట్జర్లాండు ప్రథమ స్థానంలో ఉంది.

—'జపాన్ కాలింగ్' సౌజన్యంతో

* * *

## అత్యధికంగా శిశువులు పుట్టుకు వచ్చారు



లాటిన్ అమెరికా, ఆఫ్రికా మరియు ఆసియాలో శిశువులు అత్యధికంగా పుట్టుకు వచ్చారు. ఉత్తర, పశ్చిమ మరియు మధ్య యూరప్ దేశాలలో శిశు జననాలు చాలా తక్కువ.

## భారతదేశంలో ప్రకృతి సిద్ధమైన రబ్బరు ఉత్పాదన:

భారతదేశంలో 1987 - 88 లో మొదటి 11 మాసాలలో ప్రకృతి సిద్ధమైన రబ్బరు ఉత్పాదన 2,21,717 టన్నులు. ఇది 1986-87 కాల వ్యవధిలో ఉత్పాదన మీద 14,047 టన్నుల అధిక్యతను సూచిస్తుంది.

*  *  *

## HMT 50 లక్షల వాచీలను ఉత్పాదించింది:

1987-88 లో HMT సుమారు రూ. 151.97 కోట్ల విలువగల 50 లక్షల వాచీలను ఉత్పాదించింది.

*  *  *

## ప్రత్యేక రక్షణగల స్మారక భవనాలు, ఇతర స్థలాలు ఉత్తరప్రదేశ్‌లో అధికం:

ఉత్తరప్రదేశ్‌లో ప్రత్యేకంగా రక్షింపబడే స్మారక భవనాలు, ఇతర స్థలాలు (protected mouments and sites) అత్యధికంగా - 779 ఉన్నాయి. ఇటువంటివి కర్ణాటకలో 503 ఉన్నాయి.

*  *  *

## LIC స్థాపించిన రికార్డు:

1987-88 లో LIC రూ. 12,608.3 కోట్లు వ్యక్తిత్వ భీమాల కొత్త వ్యాపారం చేసి రికార్డు స్థాపించింది. పూర్వం 38.7 లక్షల పాలసీలను జారీచేస్తే ఇప్పుడు 47.4 లక్షల పాలసీలను జారీచేసి 22.3 శాతం అభివృద్ధిని సూచించింది. ఇది LIC స్థాపింపబడిన 32 సంవత్సరాలలో అత్యధికం.

## ఎన్ని మైళ్ల దూరంలో ఉన్నా జలాశయాలను ఒంటె ఇట్టే పసిగట్టేస్తుంది



ఒంటె ఎడారిలో ప్రయాణానికి చాలా అనుకూలంగా ఉంటుంది. అందుకే దానిని 'ఎడారి ఓడ' అన్నారు. బాగా భారం వేసిన ఒంటె మల మల మండిపోతున్న కటిక ఎడారిలో కూడా ఒక్క నీటి చుక్కైనా త్రాగకుండా 200 మైళ్ళు నడుస్తుంది. ఒంటెకు జఠరభాగంలో మిలియనుల కొద్దీ చిన్న చిన్న నిల్వకణాలు (storage cells) ఉంటాయి. వీటిలో వారందాకా నీటిని నిల్వ చేసుకుంటుంది. ఒంటె ఆహారం లేకుండా కూడా చాలా రోజులపాటు జీవించగలదు. దీని వీపున ఉండే మూపులో క్రొవ్వు పొరలు పొరలుగా ఉంటుంది. దీనికి పసిగట్టే శక్తి మిక్కిలి బ్రహ్మాండంగా ఉంటుంది. ఎన్ని మైళ్ళ దూరంలో ఉన్నా మూగర్భ జలాశయాలను ఇట్టే పసిగడుతుంది.

# అణుశక్తి

ప్రొ. ఎల్.ఎస్. ప్రహ్లాదరావు

ఆగస్టు 6, 1945 ఉదయం 8 గంటలు-ఒక పెద్ద విమానం హోరుమని శబ్దం చేసుకుంటూ జపానుమీదుగా ప్రయాణం చేసింది. ఉన్నట్టుండి అకస్మాత్తుగా ఒక పారాచూట్ సహాయంతో ఒక వింత వస్తువు క్రిందికి జారుతూంది. ఇది కనిపించిన కొన్ని సెకండ్లకి క్రింద భూమి అదిరిపోయింది. పెద్ద శబ్దంతో



Nuclear Explosion

ఏదో పేలింది. ఆకాశం అంతా ధగధగా ప్రకాశించే తెల్లటి కాంతులు ప్రసరిస్తున్నాయి. 7000 డిగ్రీల సెల్షియస్ ఉష్ణంతో గాలి బయలుదేరింది. బ్రహ్మాండంగా గంటకు 400 కి.మీ. వేగంతో గాలి వీస్తూంది. ఇదే హిరోషిమా నగరంమీద ప్రేలిన అణుబాంబు ఫలితం.

హిరోషిమాలో నివసిస్తూన్న నాలుగు లక్షలమంది భయభ్రాంతులతో విలవిలలాడిపోయారు. ఈ ప్రేలుడు వల్ల సుమారు 20 000 మంది జనం మరణించారు.

ఇదే అణుబాంబుశక్తి. ప్రపంచం అంతటా పలుచోట్ల విద్యుత్తును జనింపచేసుకోడానికి ఉపయోగిస్తూన్న అణు (atom) శక్తి ఇది. జూన్ 27, 1954 న యుఎస్ఎస్ఆర్‌లో ప్రపంచపు మొట్టమొదటి 'ఎటామిక్ పవర్ ప్లాంట్' స్థాపింపబడింది.

ప్రపంచంలో యంత్రాలు తిరగడానికి, దీపాల కాంతిని ప్రసరింపచేయడానికి, వ్యవసాయ కార్యక్రమాలకు ఎంతో శక్తి అవసరమై ఉంటుంది. వీటికి ఇంధనాలుగా వాడబడుతూన్న బొగ్గు, నూనె, గాసులు, ఇతర ఇంధనాలు తరిగిపోతున్నాయి. అంతే గాకుండా వీటివల్ల అధికంగా పొగ, మరియు విషకరములైన రసాయనిక పదార్థాలు వెలువడి వాతావరణంలో కాలుష్యాన్ని అధికంచేస్తున్నాయి. కాబట్టి న్యూక్లియర్ రియాక్టర్ల ద్వారా శక్తిని కలిగించుకోడం అవసరమైంది.

అటామిక్ పవర్ ప్లాంట్ ఎలా పనిచేస్తుంది? న్యూక్లియర్ శక్తి (అటామిక్ శక్తి) ని ప్రత్యక్షంగా ఉపయోగించుకునే విధానం ద్రవ్య నిర్మాణంపై ఆధారపడి ఉంటుంది. ఏ రసాయనిక మూల పదార్థం తీసుకున్నా దీనిలో అతి చిన్న పదార్థమును ఆటమ్ (అణువు) అంటారు. అణువుకి (+) ధనాత్మకంగా చార్జి చేయబడిన భారవంతమైన కేంద్రకం (అటామిక్ న్యూక్లియస్) చుట్టూ (–) ఋణాత్మకంగా ఛార్జి చేయబడిన ఎలక్ట్రానులు ఉంటాయి. న్యూక్లియర్ విధానంలో కేంద్రకానికి (అటామిక్ న్యూక్లియస్) ముఖ్య పాత్ర ఉంది. అటామిక్ శక్తి న్యూక్లియర్ శక్తి రెంటికీ ఒకే అర్థం. అణుశక్తి నుండి విడివడిన శక్తులనే ఈ

రెండూ తెలియజేస్తాయి. అటామిక్ న్యూక్లియస్ (కేంద్రకం) లో ప్రోటీనులు (P) న్యూట్రానులు (N) అనే ప్రాథమిక కణాలు ఉంటాయి. రెంటిని న్యూక్లియన్స్ అంటారు.

న్యూక్లియర్ రియాక్టర్లలో యురేనియం అణువులు విస్ఫోటనం చెందుతాయి. దీని వల్ల ఉష్ణం జనిస్తుంది. ఈ ఉష్ణాన్ని వినియో


NUCLEAR REACTOR AT TROMBAY, INDIA

గించి ఆవిరిని ఉత్పాదిస్తారు. ఆవిరిశక్తితో టర్బైనులను త్రిప్పుతూ జనరేటర్లను ఉపయోగించి విద్యుత్‌శక్తిని జనింపజేస్తారు. విడుదలైన శక్తిని నియంత్రించుకుని కావలసిన శక్తిని కలిగించుకుంటారు. ఈ విధంగా చేసినప్పుడు శృంఖలా ప్రతిక్రియ (చెయిన్ రియాక్షన్) బయలుదేరుతుంది.

న్యూక్లియర్ రియాక్టర్లకు ఇంధనంగా యురేనియం అవసరం. యురేనియం గనుల నుండి త్రవ్వుతారు. U-235 అని చెప్పబడే ఇంధనం యురేనియం యొక్క ఒక రూపం. యురేనియం చాలా తక్కువ పరిమాణంలో లభిస్తుంది. అంతే గాకుండా ఖనిజంగా లభించే ముడి యురేనియం నుండి రసాయనిక విధానంలో యురేనియం-235 ను జాగ్రత్తగా వేరుచేయాలి. యురేనియంను ఇంధనంగా వాడడానికి ముందు దానిని శుద్ధీకరణవల్ల, కాన్‌సెంట్రేషన్‌వల్ల సారవంతం చేయాలి. ఇది సాధారణంగా గ్యాస్ డిఫ్యూజన్ ప్లాంటులలో చేస్తారు. ఒక మిలియను కిలోవాట్టుల విద్యుత్తు జనింపచేయడానికి సుమారు 100 టన్నుల యురేనియం ఇంధనం అవసరముంటుంది.

న్యూక్లియర్ పవర్ ప్లాంటుకి రియాక్టరు ఒకటి ఉంటుంది. దీంట్లో ¼ అడుగు మందం గల గొట్టంలో కూలెంట్ నీరు ప్రవహిస్తూంటుంది. యురేనియం సన్నని ఇంధనపు కడ్డీలుగా దట్టిస్తారు. నియంత్రణా కడ్డీలను తీసిన వెంటనే విస్ఫోటనం ఏర్పడుతుంది. రియాక్టరులో ఉష్ణం పెరగడానికి ప్రారంభిస్తుంది. ఈ విధంగా మధ్యభాగంలో ఉష్ణం 4000°F దాకా పెరుగుతుంది.

(మిగతా 24 వ పేజీలో)

## మశూచి ఒకప్పుడు భయంకరమైన వ్యాధి

ఒకప్పుడు మశూచివల్ల అనేకమంది మరణించారు. అనేకమందికి కళ్ళుపోయాయి. అనేకమంది కురూపులైనారు. ప్రపంచంలో పూర్తిగా మొట్టమొదట తొలగించబడిన భయంకరమైన వ్యాధి ఈ మహామారి. ఆఖరిసారి మశూచి 10 సంవత్సరాల క్రితం తూర్పు ఆఫ్రికా సోమాలియాలో మెర్కా అనే ప్రదేశంలో కనిపించింది.

—'యునైటెడ్ స్టేట్స్ ఇన్‌ఫర్మేషన్ సర్వీస్' సౌజన్యంతో

# వనితాలోకం

## ఉల్లిపాయ తరిగేటప్పుడు కళ్ళు మండకుండా ఉండాలంటే

మరుగుతున్న నీటిలో ఉల్లిపాయలను ముంచి తరిగితే కళ్ళు మంటలు పెట్టవు.



## కూరగాయలను ఎక్కువ నీటిలో ఉడకబెట్టవద్దు

కూరగాయలను ఎక్కువ నీటిలో ఉడకబెట్టవద్దు. ఎక్కువ నీటిలో ఉడకపెడితే వాటిలో ఉండే అమూల్యమైన విటమిను పోషకపదార్థాలు నశించడమేగాక, సువాసన రుచి కూడా పోతాయి.

## ఎక్కువ కారం తగ్గించాలంటే

ఏ పదార్థంలోనైనా కావలసిన దానికంటే అధికంగా కారం వేసినప్పుడు కారం తగ్గించ దానికి దాంట్లో కొంచెం టొమాటోరసం పిండితే కారం వెంటనే తగ్గిపోతుంది.

## ఉప్పు ఎక్కువైతే

ఎందులోనైనా ఉప్పు ఎక్కువైతే తోలు తీసిన బంగాళాదుంప వేస్తే ఉప్పును లాగేస్తుంది.

## నిమ్మకాయ రసం పిండితే కూరలు ఆకుపచ్చగా ఉంటాయి

ఆకుపచ్చని కాయగూరలు వండినప్పుడు కొంచెం ఆకుపచ్చని గోధుమవర్ణంలో ఉంటాయి. వాటిలో కొద్దిగా నిమ్మరసం పిండితే కూరలు ఆకుపచ్చగా ఆకర్షణీయంగా కంటికి ఎంతో ఇంపుగా ఉంటాయి.

(23 వ పేజీ తరువాయి)

రేడియో ఆక్టివిటీ: విస్ఫోటనం వల్ల ఉష్ణం జనిస్తుంది. న్యూట్రానులు విడివడతాయి. రేడియో ఆక్టివిటీ కూడా ఏర్పడుతుంది. ఈ రేడియేషన్ లీకయినప్పుడు (Leak) వాతావరణంలో చేరి ప్రాణులకు క్యాన్సరు వంటి రోగాలు కలిగిస్తాయి. న్యూక్లియర్ పవర్ ప్లాంటులనుండి వచ్చే వ్యర్థపదార్థాలు కూడా రేడియో ఆక్టివ్‌గా ఉంటాయి. రేడియేషన్‌ని 'రాడ్స్'లో కొలుస్తారు. సంవత్సరానికి 0.5 రాడ్ నిరపాయకరం. ఇది దాటితే విపరీత ఫలితాలు ప్రారంభమవుతాయి.

—'రోటరీ న్యూస్' సౌజన్యంతో

"పక్షిలా ఎగరడం సాధించాడు మానవుడు. కాని మానవునిగా

# మన ఆదిమవాసులు

## భిల్లులు

భారతదేశంలో మిక్కిలి ప్రాచీన జాతికి చెందిన భిల్లులు ఎక్కువగా మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ మరియు రాజస్థాన్ ప్రదేశాలలో కనిపిస్తారు. వీరు సుమారు రెండు మిలియను మంది ఉన్నారు. ప్రాచీనకాలంలో వీరిలో కొంతమంది రాజులుగా ఉండి రాజస్థాన్, గుజరాత్, మాల్వా, మధ్యభారత్‌లను పాలించారు.


Bhil Woman

మేవార్ రాజైన రాణాప్రతాప్ సైన్యమునకు, మొగలాయి చక్రవర్తి అక్బరు సైన్యానికి జరిగిన హాల్‌దీఘట్ట యుద్ధంలో భిల్లులు రాణాప్రతాప్‌కు సహాయం చేసారు. వీరు అహమ్మదాబాద్ (గుజరాత్) లో ముస్లిములను ఎదిరించారు. ఆ తరువాత వీరు మహారాష్ట్రులతోను, బ్రిటిషువారితోను పోరు సలిపారు.

భిల్లులు వల్లగా ఉంటారని, వీరు అడవులలో ఎవరైనా కన్పించినపుడు చాటుగా బాణంతో కొట్టి చంపి దగ్గరలో ఉండే బురద గుంటలో పారేస్తారని బ్రిటిషువారు భిల్లులను వర్ణించారు. ఈనాడు భిల్లులు తమ ఆచార వ్యవహారాలకు ఏ లోటు లేకుండా నాగరికత నొందారు. స్నేహభావంతో, దయతో అందరినీ ఆదరిస్తూ, విశ్వాసంతో ధైర్యవంతులుగా ఉంటున్నారు.

భిల్లు అంటే బాణము అని అర్థము. వీరు బాణములను, అమ్ములను అతి నైపుణ్యంగా ఉపయోగిస్తారు. అందువల్లే వీరి జాతికి భిల్లులు అనే పేరు వచ్చి ఉండవచ్చు. భిల్లులు సాధారణంగా నల్లగా ఉంటారు. మంచి దృఢ శరీరం కలవారు. ఆహారం లభిస్తే వీరు విశ్రాంతగా ఉంటారు. వీరు ముతకబట్టలు

### 108 సం. ల వృద్ధురాలికి మొట్టమొదటిసారి వైద్య చికిత్స

అజారియా (జార్జియా)లో నివసిస్తున్న 108 సంవత్సరాల వయస్సు గల శెనీసా టర్మానిడ్జె తన కెప్పుడూ ఆరోగ్యం చెడలేదని, మొదటిసారి తను వైద్యసహాయం కోరుతున్నానని చెప్పినప్పుడు సోవియట్ వైద్యులు విభ్రాంతపోయారు. కండ్లో ఏర్పడిన కాటరాక్టు పొరను తీయించుకోడానికి ఈ ముసలమ్మ శస్త్రచికిత్స చేయించుకుంది.

ధరిస్తారు. పురుషులు మోకాళ్ళమీదకి పంచ గట్టి పైన బనియన్ వేసుకుంటారు. తల పాగా చుట్టుకుంటారు. స్త్రీలు లంగాగట్టి, పైన రవిక ధరిస్తారు. వీరు సాధారణంగా ఇత్తడి ఆభరణాలు పెట్టుకుంటారు. శరీరంమీద పచ్చబొట్టు పొడిపించుకోడం అంటే వీరికి చాలా ఇష్టం.

భిల్లుల గ్రామాలు విడివిడిగా చెదరగొట్టి నట్టు ఉంటాయి. వీరి కులపెద్దను 'వాసవో' అంటారు. భిల్లులు చాలామంది వ్యవసాయ దారులు. వీరు పశువులను కూడా పెంచు తారు. కొంతమంది దగ్గర దగ్గర అడవులలో కలప, తేనె సంగ్రహించి చుట్టుపట్ల గ్రామా లలో అమ్ముతారు.

శివుడు, రాముడు, కృష్ణుడు, హనుమాన్ మొదలగు దేవతలను ఆరాధిస్తారు. భూతాలు, దయ్యాలు మొదలైన దుష్టశక్తులను కూడా విశ్వసిస్తారు. ఈ జాతికి చెందినవారిలో స్త్రీలకు ఎక్కువ గౌరవం వీరిలో స్త్రీ జనాభా చాలా తక్కువ. అందుచేతే వరుడు వధువుకు సొమ్ము చెల్లించి పెళ్ళి చేసుకుంటాడు. భిల్లు స్త్రీలు పాటలు పాడుతూ నృత్యం చేస్తారు.

హిందువులలాగే వీరు దసరా, దీపావళి మొదలైన పండుగలు వైభవంగా చేసుకుం టారు. కులాసాగా ఆనందంగా పాటలు పాడుకుంటూ కాలం గడుపుతారు. ఆయుధా లతో నృత్యం చేస్తూ భయంకరంగా త్రిప్పు తారు వీరు చాలావరకు తమ ప్రాచీన అల వాట్లను మార్చుకున్నారు. వీరు ఇంకా ఆర్థి కంగా బాగా వెనుకబడినవారే. అభివృద్ధి చెందిన వ్యవసాయ సాధనాలను ఉపయో గించరు.

## దివ్య సందేశాలు



ఒకరి కోసం పరితపించిపోతూ బాధ పడడం మమకారానికి చిహ్నం.

జీవితంలో నైరాశ్యం, నిస్పృహ వద్దు. జీవితాన్ని తేలికగా, విలాసవంతంగా చేసుకో.

ఇతరులు మాట్లాడేటప్పుడు ఓపికతో విను.

హాస్యభావం అలవరుచుకో. నీవు ఎక్కడ ఉన్నా, ఏం చేస్తున్నా చిరునవ్వుతో జీవితం ఆనందమయం చేసుకోవచ్చు.

జీవితానికి ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకో. దానిని సాధించడానికి పూనుకో. సంతోషం కలుగుతుంది.

నిరుత్సాహంతో ఎందుకు వచ్చిన జీవితం అనుకోడం కంటే పాపం మరొకటి లేదు.

కష్టపడకుండా సంపాదించిన ధనం ఎన్నో సమస్యలను తెచ్చిపెడుతుంది.

భగవంతుడు ప్రక్కన అభయం ఇస్తుంటే భయమెందుకు?

ఇతరుల సౌభాగ్యం-సంపద చూచి ఆనం దించేవారు ధన్యులు.

మతం, ధర్మం వాదించుకోడానికి కాదు.

—డి. ఆర్. గోయల్

''జీవితం ఒక ఆటలాంటిది. ఎంత సేపు ఆడావన్నది

# కొన్ని సామాన్య వ్యాధులు-నివారక చర్యలు

జానకి మోసెస్

అనేక సామాన్య రోగాలను అతి సులభంగా మనం ఇంటి మందులతో ఇంట్లోనే కుదుర్చుకుని ఆరోగ్యాన్ని కాపాడుకోవచ్చు.

ఏ రోగానికైనా తేనె మనకు ప్రకృతి ప్రసాదించిన ఒక దివ్య ఔషధం. అనేక ఔషధ గుణాలు, పోషకాంశాలతో పాటు దీని




మధురాతి మధురమైన రుచి వల్ల ఎటువంటి చేదు ఔషధాలనైనా సులభంగా తీసుకోవచ్చు. తేనె ఒక ముఖ్య అనుపానం. సామాన్య జలుబులకు అరకప్పు వేడినీటిలో ఒక చిన్న చెంచాడు నిమ్మరసం కలిపి కొద్దిగా తేనె చేర్చి త్రాగి విశ్రమిస్తే వెంటనే గుణం కనిపిస్తుంది. గొంతు నొప్పికి, కొద్దిగా మెత్తటి సున్నంలో తేనె చేర్చి రంగరించి కంఠమణి క్రింద బాగా పట్టించండి.

సరిపడని పదార్థాలు తిన్నప్పుడుగానీ, ఆహారం అధికంగా తిన్నప్పుడుగానీ అజీర్ణం ఏర్పడి కడుపునొప్పితో, ఆయాసంతో బాధ పడతారు. దీనిని సులభంగా నివారించుకోవచ్చు. చిన్న అల్లంముక్క చితగ్గొట్టి వేడి నీళ్ళలో పడవేసి తీసిన అల్లపురసంలో తేనె కలిపి వేడివేడిగా త్రాగాలి.

శొంఠి (ఎండబెట్టిన అల్లం) మెత్తగా పొడిచేసి వస్త్రకాళం చేసి ఆ పొడిని ఒక సీసాలో గాలి తగలకుండా జాగ్రత్తపెట్టండి. ఒక చిన్న చెంచాడు శొంఠి పొడిలో తేనె కలిపి తింటే కడుపులో త్రిప్పుడు, వాంతులు ఇట్టే తగ్గుతాయి. ఆకలి పుట్టిస్తుంది. త్రేనుపులు తగ్గుతాయి. తిన్న వెంటనే మాత్రం నీరు త్రాగవద్దు.

ప్రతినిత్యం మనం వాడుకునే ఉప్పు ఒక ఔషధం అంటే మీకు ఆశ్చర్యం కలుగక మానదు. ఉప్పును నీటిలో బాగా కలిపి వడగట్టి ఆ ఉప్పు ద్రావణాన్ని సీసాలో పెట్టి ఉంచండి. కళ్ళలో ఏదైనా నలుసుపడినప్పుడు గానీ, కళ్ళలో మంట కలిగినప్పుడు గానీ రెండుమూడు చుక్కలు ఈ ఉప్పుద్రావణం కళ్ళలో వేసుకుంటే వెంటనే తగ్గిపోతుంది.

చెవిలో చిన్న చీమలు, ఈగలు, దోమలు మొదలైనవి దూరినప్పుడు చెవిలో నాలుగైదు చుక్కలు ఉప్పుద్రావణం వేస్తే పురుగు లోపల చనిపోతుంది లేకపోతే బయటకు వచ్చేస్తుంది. గొంతుక నొప్పి లేక ఇతర గొంతు రోగాలకు ఉప్పుద్రావణం వెచ్చని నీటిలో కలిపి నాలుగు లేక అయిదుసార్లు పుక్కిలించాలి. తలలో జలుబు, చెవిలో పోటు, ముక్కుదిబ్బడ మొదలైన వాటికి ఉప్పునీటితో రెండు ముక్కు రంధ్రాలను శుభ్రంగా కడగండి.

కాలిలో ముల్లు గ్రుచ్చుకున్నప్పుడుగాని, రాయి గ్రుచ్చుకున్నప్పుడుగాని ఉప్పు కాపడం పెడితే పోటు తగ్గిపోతుంది. వంట ఇంట్లో

ఉప్పునీటి ద్రావణం కాల్పులకు, బొబ్బలకు చేతికి అందుబాటుగా ఉండాలి. కాలినప్పుడు వెంటనే ఉప్పు నీటితో కడిగితే బొబ్బలు ఎక్కువ, పుళ్ళు ఏర్పడవు.

కీళ్ళవాతము, కీళ్ళనొప్పులు, గుండెనొప్పి మొదలైనవాటికి వేపనూనెను మించిన ఔషధం ఇంకొకటి లేదు. ముఖ్యంగా మూర్ఛరోగాలకు ఒంటికి వేపనూనె మర్దన చేయాలి. భరించలేని చెవిపోటుకు వెల్లుల్లితో వేపనూనె కాచి వెచ్చగా రెండుమూడు చుక్కలు వేసి ఆ వెల్లుల్లిపాయ ముక్కను చెవిలో పెట్టుకుంటే తగ్గిపోతుంది.

గర్భిణీ స్త్రీలకు వెల్లుల్లి పాల హల్వాచేసి ఇస్తే మంచి పుష్టిని కలిగిస్తుంది. నాలుగైదు వెల్లుల్లి రేకలు మెత్తగా నీటితో నూరి ఆ ముద్దను చెంచాలో వేడిచేసి వేడివేడిగా నుదుటికి పట్టిస్తే తలనొప్పికి ఆస్ప్రిన్, నోవాల్జిన్ వాడక్కరలేదు. వెల్లుల్లికి బదులు శొంఠి పట్టుకూడా వేయవచ్చు.

మిరియాల కషాయంలో బెల్లంగాని, తేనెగాని కలిపి పుచ్చుకుంటే ఫ్లూ జ్వరాలు విమ్ముకిస్తాయి. సాధారణంగా చంటిపిల్లలు జలుబుతో బాధపడుతూంటారు. నిద్రపోరు. చీదరతో ఏడుస్తారు. అటువంటప్పుడు ఒక గరిచెలో కొద్దిగా కొబ్బరినూనె తీసుకుని అందులో ముద్దహారతి కర్పూరం ముక్క వేసి వేడిచేయండి. కర్పూరం అందులో కరిగి కాంఫర్ లినమెంటు (కర్పూరం కరిగిన నూనె) తయారవుతుంది. దీనిని గుండెలకు, వీపుకు పట్టిస్తే వెంటనే ఉపశమనం కలుగుతుంది. హాయిగా నిద్రపోతారు.

ఆమశంక. జిగట విరేచనాలతో బాధపడుతుంటే పరగడుపున కోడిగ్రుడ్డు సొనను మ్రింగి చూడండి. పంచదార, పాలు కలపకుండా మంచి స్ట్రాంగ్ టీ డికాక్షన్ కూడా దీనికి మంచి మందు.

ఏదైన పురుగు కరచినప్పుడు నీరుల్లిపాయను అడ్డంగాకోసి కుట్టినచోట ఉల్లిపాయ ముక్కతో రుద్దితే విషం హరించిపోతుంది. మంటలు తగ్గుతాయి. సున్నం పట్టు వేస్తే నొప్పి, వాపు తగ్గిపోతుంది.

## నాల్గవ వంతు ప్రపంచ జనాభాకి యోగ్యమైన వసతి సౌకర్యాల కొరత



అభివృద్ధి చెందుతూన్న వర్ధమాన దేశాలలో ఒక బిలియను (1000 మిలియను) మందికి 1987వ సంవత్సరాంతానికి (యునైటెడ్ నేషన్స్ ఇంటర్నేషనల్ హాబిటాట్ సంవత్సరం) తలదాచుకోడానికి ఇళ్ళు లేవు. సుమారు నాల్గవ వంతు ప్రపంచ జనాభాకి వాసయోగ్యమైన సౌకర్యాలు లేక మురికివాడలలోను, పెంటకుప్పల ప్రక్కన పూరిగుడిసెలలోను నివసిస్తున్నారు.

# ఆరోగ్యాభివృద్ధికి నీటి ప్రాధాన్యత

డా. జె. డబ్ల్యు. మెక్ ఫార్లాండ్

ఆరోగ్యాభివృద్ధికి విధించిన ఔషధాలలో చేర్చబడే ముఖ్య వస్తువు నీరు. అధమం రోజుకు 6 గ్లాసుల నీరు త్రాగకుండా ఆరోగ్యం నిలబెట్టుకోలేరు. శరీరంలో ఉష్ణం శాంతించి చల్లగా ఉండడానికి నీరు అత్యావశ్యకము. చర్మానికి, దేహంలో ఉండే



ఉష్ణానికి గల ఒక చక్కని ఏర్పాటుతో ఇది జరుగుతుంది. పైన గడ్డకట్టుకుపోతూన్న చలిగాలిలో గాని, మండిపోతూన్న ఎండలో గాని, తీవ్రమైన జ్వరంతో వేగిపోతూన్నప్పుడుగానీ శరీరంలో శీతలీకరణ విధానం దానంతట అదే మహాద్భుతంగా జరిగిపోతూ, ఆయా పరిస్థితులకు అనుకూలంగా సరిదిద్దుకుంటుంది. వేసవిలో సాధారణంగా 4 మొదలు 5 లీటర్ల నీరు చర్మం ద్వారా. ఊపిరితిత్తుల ద్వారా వెలికిపోతుంది. దీనిని ఎప్పటికప్పుడు భర్తీ చేయాలి.

ప్రతీసారి నువ్వు కనురెప్ప వేసినప్పుడు, ముక్కు తుడుచుకున్నప్పుడు, బస్సుకోసం పరుగెత్తినప్పుడు, ఏదైనా తినేటప్పుడు, మాట్లాడేటప్పుడు ఏ పని చేసినా నువ్వు నీటిని ఉపయోగిస్తున్నావు. నీ శరీరంలో 100 మిలియను సూక్ష్మకణాలలో ప్రతీకణం కూడా దాని ఆహారం అది తీసుకుంటూ, శక్తిని ఉత్పాదిస్తూ వ్యర్థపదార్థాలను విసర్జిస్తూంటుంది. శరీరంలో జరిగే ప్రతీ రసాయనిక, విద్యుత్ ప్రక్రియ కూడా ద్రవయానం (Liquid Medium) లో జరుగుతుంది. నీరు లేకుండా ప్రాణంలేదు.

## మొట్టమొదటి క్రిస్మస్ ట్రీని ప్రిన్స్ ఆల్బర్ట్ ప్రవేశపెట్టాడు

క్రిస్మస్ పండుగరోజులలో దీపాలతో అలంకరింపబడిన క్రిస్మస్ ట్రీని ప్రపంచం అంతటా క్రైస్తవులు ఇళ్ళలో పెట్టుకుంటారు. అనేక సంవత్సరాలనుంచి 'ఫర్' చెట్టును జర్మనీ, ఆస్ట్రియా, యూరప్ దేశాలలో క్రిస్మస్ చెట్టుగా వాడుతున్నారు. క్రీస్తు పుట్టిన రాత్రి ప్రపంచంలో చెట్లన్నీ పువ్వులు తొడిగాయని క్రైస్తవుల విశ్వాసం.

1841 లో ఆల్బర్ట్ యువరాజు ఇంగ్లండులో క్రిస్మస్ ట్రీని ప్రవేశపెట్టాడు. విండ్సర్ కాసిల్ లో పిల్లల క్రిస్మస్ వేడుకలలో దీనిని ప్రదర్శించారు. ఆనాటినుంచి 'క్రిస్మస్ ట్రీని ప్రపంచంలో ప్రతి ఇంట్లోను క్రైస్తవులు పెట్టుకోవడం ప్రారంభించారు.

నీ శరీరం అసలు 50 మొదలు 70 శాతం అంతా నీరే. 10 మొదలు 13 బిలియను మెదడు కణాలు పూర్తిగా 70 శాతం నీరు. శరీరంలో నీటి మట్టం లేక ప్రమాణం తగ్గిపోతే నీ మామూలు ప్రవర్తన, వడవడి మారిపోతుంది. ఒళ్ళు పీక్కుపోతూంటే, అలసట కలుగుతూంటే, ఆలోచించలేకపోతూంటే నీకు నీళ్ళు అవసరం అన్న మాట.

శరీరంలో గనుక నీటిని నిలవచేసుకునే పాటిలేని విధానాలు లేకపోతే శరీరావయవాలు సక్రమంగా వాటి వాటి పనులు నిర్వర్తించుకోడానికి రోజుకి 12 000 లీటర్ల (40,000 గ్లాసుల) నీరు అవసరం ఉంటుంది. అతి చాకచక్యంగా శరీరంలో ఉండే 'ఫిల్టరింగ్ ప్లాంట్' అనే కిడ్నీలు ఈ పనిని చూసుకుంటాయి. ప్రతీ రోజూ ఇవి 2 మొదలు 4 లీటర్ల ద్రవాన్ని విసర్జిస్తాయి. కావలసినంత నీటిని భర్తీ చేసుకోకపోతే ఇవి సరిగా పని చేయవు. చాలామంది అవసరమైన నీటిని త్రాగకుండా వాటిచేత అధికంగా పనిచేయిస్తారు.

ఆరోగ్యాన్ని నిలబెట్టుకోవాలంటే రోజూ నిద్రలేచిన వెంటనే పొద్దున్నే రెండు గ్లాసుల నీరు, బ్రేక్‌ఫాస్టు మధ్యాహ్నం భోజనానికి మధ్య రెండు గ్లాసుల నీరు, మధ్యాహ్నంనుంచి రాత్రి భోజనానికి మధ్య రెండు గ్లాసుల నీరు మొత్తం ఆరు గ్లాసుల మంచినీరు అవసరం.

ఈ ఆరోగ్య సూత్రాన్ని పాటిస్తే అనవసరమైన బాధలు, నొప్పులు కలిపించవు. ఆరోగ్యంగా ప్రాణం నిలబెట్టుకోడానికి నీరు ఆవశ్యకం. నీరు జీవితప్రమాణాన్ని పొడిగిస్తుంది. మీకు దగ్గరగా ఉన్న మంచినీటి కొళాయే మీ యౌవ్వనాన్ని నిలబెట్టుకోడానికి ఆధారం.

—'హెరాల్డ్ ఆఫ్ హెల్త్'
సౌజన్యంతో

## బైసైకిల్ 1842 లో నిర్మించబడింది



స్కాటిష్ దేశస్థుడైన కిర్క్‌పాట్రిక్ మాక్మిలన్ 1842 లో మొట్టమొదటి బైసికిల్‌ను (పెడిల్స్, డ్రైవింగ్ రాడ్‌లతో నిర్మించాడు. 1865 పారిస్ (ఫ్రాన్స్) లో రోటరీ క్రాంక్‌లతో సైకిల్ నిర్మించబడింది. కాలక్రమేణా కొంత కాలానికి తేలికైన స్పోక్సుల చక్రాలతో, రబ్బరు టైర్లతో సైకిళ్ళు ప్రవేశపెట్టబడ్డాయి. పెన్నీ ఫార్తింగ్‌కి ముందు చక్రం చాలా పెద్దదిగా ఉండేది. సుమారు 160 సెం.మీ.ల వ్యాసంతో ముందు చక్రం ఉంటే వెనుక చక్రం 30 సెం.మీల వ్యాసంతో ఉంటుంది. ఒకే సైజు చక్రాలతో స్ప్రాకెట్ గొలుసుతో తిరిగే బైసికిల్‌ను ఇంగ్లండులో 1885 లో జేమ్స్ స్టార్లే నిర్మించాడు. నేటి సైకిల్‌లో అత్యుత్తమమైన సాధనానికి ఒక్కొక్కప్పుడు 50 గేర్లు కూడా ఉంటాయి.

# అపూర్వ విషయాలు

### వంశంలో 600 మంది

న్యూజిలాండ్ ఫెదర్‌స్టన్‌కు చెందిన హెన్రీ బర్లింగ్ (Henry Burling) (1801 - 1911) చనిపోయేటప్పటికి 110 సంవత్సరాల వయస్సు. అప్పటికి అతడి వంశంలో 600 మంది ఉన్నారు.

### రూర్ ప్రదేశంలో బొగ్గు

రూర్ (ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ)



ప్రదేశంలో గట్టిబొగ్గు కనుగొనబడింది. ఇది 400 సం. ల పైదాకా వారికి సరిపోతుంది.

### మిక్కిలి ప్రాచీనమైన జాతీయ పతాకము

ఉత్తర మధ్య యూరపుకు చెందిన డెన్మార్క్ సామ్రాజ్యం పతాకం ఎరుపు రంగుమీద తెల్లటి శిలువతో ఉంటుంది. 1219 లో ప్రవేశపెట్టబడిన ఈ పతాకం మిక్కిలి ప్రాచీనమైనది.


## STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS ABOUT NEWSPAPER "WISDOM" MADRAS - 600 004

**FORM IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | | : MADRAS |
| 2. Periodicity of Publication | | : MONTHLY |
| 3. Printer's Name | | : K V. GOVINDA RAO |
| | Nationality | : INDIAN |
| | Address | Printed at M/s. Desh Publications (P) Ltd., 267-B, Royapettah High Road, Madras - 600 014. |
| 4. Editor's & Publisher's Name | | K V GOVINDA RAO |
| | Nationality | INDIAN |
| | Address | 9, Desika Road, Mylapore, Madras - 600 004 |
| 5. Name & Address of individuals who own the Newspaper and Partners | | Wisdom Publications, 9, Desika Road, Mylapore, Madras - 600 004 |

I, K V GOVINDA RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief

(sd) K V GOVINDA RAO

dated 1 3.89 Editor & Publisher

Madras-600 004 "WISDOM"


### టొమాటోకి మొదటి పేరు

టొమాటోని మొట్టమొదట 'లవ్ ఆపిల్' (Love Apple) అనేవారు.

## మనిషి ఆకారం ఉండే ఏప్ కోతులలో గొరిల్లా మిక్కిలి పెద్దది

మనిషి ఆకారంలో ఉండే తోకలేని కోతులలో గొరిల్లాలు పశ్చిమ ఆఫ్రికా అడవులలో నివసిస్తాయి. పెద్ద శరీరంతో భయంకరంగా కనిపించినా అతి శాంతంగా ఉంటాయి. ఇవి పూర్తిగా శాకాహారులు. సాధారణంగా కొమ్మలతో నిర్మించుకున్న గూళ్ళలో నివసిస్తాయి.

## సులభమైన భాషాశైలికి విలియమ్ వర్డ్స్‌వర్త్ గీతికలు ప్రసిద్ధిపొందినవి

విలియం వర్డ్స్‌వర్త్ (1770 - 1850) సుప్రసిద్ధ ఆంగ్లేయకవి. అతి సులభశైలిలో ప్రకృతిని వివరిస్తూ అనేక ప్రేమగీతికలను రచించాడు. పొయెట్ లారెట్‌గా ఉన్న ఏడు సంవత్సరాలలో ఇతడు ఏమీ వ్రాయలేదు.

## మహాభారతంలో మూడు మిలియను మాటలు ఉన్నాయి

భారతదేశపు సుప్రసిద్ధ కావ్యము మహాభారతం 400 బి.సి. 200 ఎ.డి. మధ్య రచింపబడింది. దీంట్లో సుమారు మూడు మిలియను మాటలు ఉన్నాయి.

## I వ ఛార్లెస్ రాజు ఎత్తు 4 అడుగుల 7 అంగుళాలు

ఇంగ్లండు, స్కాట్లండ్ మరియు ఐర్లాండుకు రాజైన Iవ ఛార్లెస్ రాజు (1625-49) ఎత్తు 4 అడుగుల, 7 అంగుళాలు.

## సత్యం తెలియచెప్పడమే కాదు ప్రేరేపింపబడాలి



మండుతూంటే గాని దీపం ఇంకో దీపాన్ని వెలిగించలేదు. యోచనాశక్తి లేని ఉపాధ్యాయుడు తను చెప్పవలసిన విషయాన్ని అంతా చెప్పిన తరువాత తిరిగి చెప్పినదే తిరిగిచెప్పి విద్యార్థుల మనస్సులను భారవంతం చేస్తాడు. సత్యం తెలియచెప్పడమే కాదు ప్రేరేపింపబడాలి. ప్రేరేపణ లేకుండా మనస్సులో విషయం పెరిగిపోతూంటే సత్యం సహజమైన అనంతతత్త్వాన్ని కోల్పోతుంది. మనం పాఠశాలలో చదువుతున్నది అంతా వ్యర్థం. మన ఉపాధ్యాయులు చెప్పేవి గత చరిత్ర మాత్రమే గాని పవిత్రమైన జీవితానికి, దివ్య ప్రేమకు ఉండే సంబంధం చెప్పరు.

—రవీంద్రనాథ్ ఠాగూర్

# గాంధీమహాత్ముని సుప్రసిద్ధ సుభాషితాలు

**1. పదకొండు నియమాలు**

అహింసా మార్గమును అవలంబించుట
సత్యము పలుకుట
దొంగలించకుండుట
బ్రహ్మచర్యము అవలంబించుట
పాటుపడి పనిచేయుట
రుచికోసమని తినకుండుట
భయవర్జితులై ఉండుట
సర్వధర్మ సమానత్వము పాటించుట
స్వదేశాభిమానము కలిగి ఉండుట
అంటరానితనమును పాటింపకుండుట
నిష్ఠతో ఏకాదశి వ్రతమును అవలంబించుట

**2. సమాజంలో జరిగే సప్త పాపాలు**

చిత్తశుద్ధిలేని రాజకీయాలు
శ్రమలేని సంపద
నీతిలేని వ్యాపారము
వివేకంలేని విద్య
ఆత్మదూరమైన ఆనందం
మానవతలేని శాస్త్రం
త్యాగంలేని ఆరాధన

**3. గాంధీయిజమ్**

గాంధీయిజమ్ అనేది ఏదీ లేదు. నా తరువాత ఏవిధమైన వర్గమూ నా పేర ఉండరాదు. నేనొక క్రొత్త సిద్ధాంతాన్ని గానీ, వర్గాన్నిగానీ సృష్టించానని చెప్పుకోవడం లేదు. మన దైవందిన జీవితాలకు, వాటి సమస్యలకు అనంతమైన సత్యాలను నా పంథాలో ప్రయోగించడానికి ప్రయత్నం మాత్రమే చేశాను.

**4. గాంధీ అనుచరుడు**

నేను గాంధీ అనుచరుడనని ఎవరూ చెప్పుకోరాదు. నాకు నేనే అనుచరుడనైతే చాలు. నా స్థిర నమ్మకాలకు అనుగుణంగా

## తిరువళ్ళువర్ సూక్తులు


THIRUVALLUVAR

నీటివల్ల బాహ్యశుచి కలుగుతుంది.
సత్యసంధతవల్ల అంతశ్శుద్ధి ఏర్పడుతుంది

* * *

పైకి నవ్వుతూ మోసగించే గోముఖ వ్యాఘ్రాలకు భయపడవలసి వస్తుంది.

* * *

ప్రపంచపు ఉత్కృష్టతే విన్న ఉన్న మనిషి నేడు ఉండక పోవడం.

నేను జీవించలేకపోతున్నాను. అందువల్ల నాకై నేను ఎంత అసంపూర్ణ అనుచరుడనో నాకు తెలుసు.

**5. నేను, నా ప్రబోధం**

నేను బోధించేది సనాతనమైనది, బోధించేది ఆచరించడానికి ప్రయత్నిస్తున్నాను. మనలో గల సామాన్య మానవుడు లోబడే వ్యామోహాలకు, బలహీనతలకు లోబడే అవకాశం గల అతిసాధారణ మానవుడను నేను. అందువలననేను ఆచరించే ప్రతి ఒక్కరూ ఆచరించగలిగినవదే.

**6. జీవితం**

మన భాషణ ద్వారాగానీ, వ్రాతమూలకంగా గానీ ఎవరినీ ఉద్బోధించనక్కరలేదు. మన జీవితమే బోధచేయగలదు. మన జీవితాలు పరులు పఠించేందుకు వీలుగా తెరచిన పుస్తకాలై ఉండాలి

**7. నా సందేశం**

నా జీవితమే నా సందేశం:

**8. నా మతం**

నా మతం సత్యం, అహింసలపై ఆధారపడి ఉంది. సత్యం నా దైవం. నా దైవాన్ని సాక్షాత్కారం చేసుకోడానికి అహింస నా సాధనం. నా మతానికి భౌగోళిక పరిమితులు లేవు.

**9. నా లక్ష్యం, నామార్గం**

నా లక్ష్యం సత్యసూర్య సందర్శనం. అందుకే నా మార్గం అహింసా ధర్మానుష్ఠానం.

— 'నైతిక విప్లవము' సౌజన్యంతో

## పాఠశాల విద్య కూడా పూర్తిచేయని సుప్రసిద్ధ పురుషులు


CHARLIE CHAPLIN

| | | |
|---|---|---|
| చార్లీ చాప్లిన్ | : | బ్రిటిష్ నటుడు మరియు ఫిల్మ్ డైరెక్టరు |
| చార్లెస్ డికెన్స్ | : | నవలా రచయిత |
| థామస్ ఎడిసన్ | : | యుఎస్ ఇన్వెంటర్ |
| మాక్సిమ్ గోర్కీ | : | రష్యన్ రచయిత |
| మార్క్ ట్వెయిన్ | : | యుఎస్ హ్యూమరిస్ట్, గొప్ప రచయిత |
| ఆండ్రూ కార్నీజీ | : | యుఎస్ పారిశ్రామికవేత్త మరియు దానశీలుడు. |

# ఆవును గురించి తెలియని విషయాలు

అడవి ఎద్దులను మచ్చికచేసి పెంచడం సుమారు 8.000 సంవత్సరాలకు పూర్వం భారతదేశంలో ప్రారంభమైంది.

2000 సంవత్సరాలకు ముందు ఆవులు చాలా ఎత్తుగా ఉండేవి. అప్పుడు విలుచుండే పాలను పితుక్కోవలసి వచ్చేది.



18 వ శతాబ్దం నాటికి ఒక పెరిగిన ఆవు చిన్న దూడకంటే పెద్దదిగా ఉండేది కాదు. అద్భుతమైన పరిణామ ప్రక్రియవల్ల ఆవు పరిమాణము, భారము కూడా మిక్కిలి ఆశ్చర్యకరంగా తగ్గిపోయాయి.

సంకర జాతుల ఉత్పాదన విధానాలను అవలంభించుటవలన ఇప్పటికి వికరంగా 960 రకాలు ఏర్పడ్డాయి.

ఆవులు సాధారణంగా 1.5 మీటర్ల ఎత్తు కంచెలను, పిల్లి అంత సామర్థ్యంగా దాట గలవు. గంటకు 40 కి.మీ.ల వేగంతో పరు గెత్తగలవు.

ఎద్దులను ప్రేరేపించడానికి ఏ రంగైనా వాడవచ్చు. కానీ స్పెయిన్‌లో ఎద్దులతో పోట్లాడేవారు ఎర్రరంగే ఎక్కువ ప్రేరేపక రంగా ఉంటుందని విశ్వసిస్తారు.

## పార్టీ ప్రభుత్వం కాదు

పార్టీ ప్రభుత్వం కాదు. ఇది ప్రజల తరఫు ఒక తాత్కాలిక ధర్మకర్త. వివ యంతో నీతితో ప్రజలందరికీ మంచి చేయాలి గానీ పార్టీ ప్రయోజనాలకోసం కర్తృత్వాన్ని దుర్వినియోగం చేయకూడదు.

—రాజాజీ

## సుభాషితాలు

ధనము లేకయున్న ధైర్యంబు చిక్కదు
ధైర్యమొదవదేని ధన మొదవదు
ధనము ధైర్య మరయదగు భూమినరులకు
విశ్వదాభిరామ వినుర వేమ!

[ధనం లేకపోతే ధైర్య ముండదు. ధైర్యం లేనప్పుడు ధనము రాదు. కాబట్టి ధన ధైర్యాలు రెండూ ఉండితీరాలి.]

* * *

నీటిలోని వ్రాత నిలువక యున్నట్లు
పాటి జగతి లేదు పరము లేదు
మాటి మాటి కెల్ల మారును మూర్ఖుండు
విశ్వదాభిరామ వినుర వేమ!

[ఇది మంచి ఇది చెడ్డ అని ఆలోచించక మూర్ఖుడు మాటి మాటికి మాటలు మారు స్తాడు. నీటిమీద వ్రాసిన వ్రాతవలె ఆ మాట నిరుపయోగము.]

పశువులకు ఉప్పు మిక్కిలి ప్రియమనుకోడం కేవలం భ్రాంతి మాత్రమే. వీటికి ఉప్పు, చక్కెర రెండూ పెట్టినప్పుడు ఇవి సాధారణంగా చక్కెరనే అభిలషిస్తాయి.

ఆవుల వాసనాశక్తి అమోఘమైనది. వెయ్యిదూడలు గల పెద్ద మందలో కూడా తన దూడను ఇట్టే పట్టేస్తుంది.

ఖనిజ సంబంధమైన ఎరువులు పసిగట్టిన భూములలో గడ్డి ఎంత ఒత్తుగా ఉన్నా ఇవి మేయవు.

ఆవు అరుపులో పదకొండు రకాల స్వరాలు ఉద్భవిస్తాయి!

దూడను పరామర్శించేప్పుడు ఆవు అనేక స్వరాలను జనింపచేస్తుంది. ఇవి దూడలు సులభంగా తెలుసుకోగలుగుతాయి.

ఆవు ఎప్పుడూ జాగ్రత్తగా పరిసరాలను పరిశీలిస్తూంటుంది. ఏదైనా అసాధారణమైన వాతావరణంలో భయపడి బెదిరిపోతుంది.

పశువులు బాగా ప్రవృద్ధిపొందడానికి మానవులలాగే వీటికి మానసిక శాంతి చాలా ముఖ్యం.

ఈనాడు ప్రపంచంలో 200 మిలియను పశువులు ఉన్నాయి.

క్యూబాలో "ఉబ్రే బ్లాంకా" (Ubre Blanca) అనే ఆవు అత్యధికంగా పాలిచ్చి ప్రపంచ రికార్డును స్థాపించింది. మూడవ ఈత 305 రోజులలో ఇది 3.8 శాతం క్రొవ్వుతో 24,268.9 కి.గ్రా.ల పాలను ఇచ్చింది. ఒకరోజు ఇది అత్యధికం 110 కి.గ్రా.ల పాలు ఇచ్చింది.

'సోవియెట్ స్టడీ ఆన్ ది హిస్టరీ ఆఫ్ ది కౌ' సౌజన్యంతో

## కొన్ని గ్రంథాలు - వాటి రచయితలు




| | |
|---|---|
| ఎడ్వెన్చర్స్ ఆఫ్ షెర్లాక్ హోమ్స్ | ఆర్థర్ కోనన్‌డైల్ |
| ఎ పాసేజ్ టు ఇండియా | ఇ. ఎమ్. ఫార్స్టర్ |
| హంగ్రీ స్టోన్స్ | రవీంద్రనాథ్‌టాగూర్ |
| ఇండియన్ వార్ ఆఫ్ ఇండిపెండెన్స్ | వి. డి. సావర్కార్ |
| మై ఎక్స్‌పెరిమెంట్ విత్ అన్‌ట్రూత్ | మైకేల్ హెండర్సన్ |

# అక్కడా - ఇక్కడా

## 120 హెక్టేరుల క్షేత్రం విశిష్టకరమైన విత్తనాలను సరఫరా చేస్తుంది

నైవేలీలో తమిళనాడు కో ఆపరేటివ్ ఆయిల్ సీడ్స్ గ్రోయెర్స్ ఫెడరేషన్‌వారు ప్రారంభించిన 120 హెక్టేరుల అగ్రోనమిక్ సెంటర్ మరియు డిస్ట్రిక్ట్ ఫారం పెద్ద నేషనల్ సీడ్‌గ్రిడ్‌గా ఏర్పడడానికి అవకాశాలు కల్పిస్తున్నాయి ఈ నైవేలీ క్షేత్రం మంచి విశిష్టకరమైన విత్తనాలను, రైతులకు సరఫరా చేయడంవల్ల భారతదేశానికి అధికంగా విదేశీమారకం ఆదాయం అవుతుంది.

## రోము నగరంలో మొట్టమొదటి మసీదు

ఇటలీ రాజధాని నగరమైన రోములో మొట్టమొదటి మసీదు త్వరలో ఏర్పాటు కాబోతుంది. టైబర్ నదికి ఇరుప్రక్కలా ఒకే భగవంతుడున్నాడనే ఆస్తికులకు మూడు ముఖ్యమైన ప్రార్థనా మందిరాలు ఉంటాయి. కాథలిక్కులకు సెంట్‌పీటర్స్, ముస్లిములకు మసీదు, జ్యూలకు సినగాగ్.

## కాలిఫోర్నియానుంచి రాకాశి గ్రుడ్డు

కాలిఫోర్నియా ఉత్తర హాలీవుడ్‌కు చెందిన అల్ఫ్రెడా జె. ఫిలిప్స్ దగ్గర ఉన్న మాన్‌కోవీ డక్ (ఒకవిధమైన బాతు) ఒక గ్రుడ్డును పెట్టింది. ఈ చివరినుంచి ఆ చివరకు ఈ గ్రుడ్డు పరిమాణం 4 అంగుళాలు ఉంది.

## 2500 సంవత్సరాలనాటి గ్రీకు ఓడ కనుగొనబడింది

బ్రిటిష్ మరియు ఇటాలియన్ భూగర్భశాస్త్ర పరిశోధకులు సిలికాన్ సముద్రతీరంలో పెనారీ (Panarea) ద్వీపం దగ్గిర నీటిలో మునిగిపోయిన 2,500 సంవత్సరాలనాటి ఒక గ్రీకు ఓడను కనుగొన్నారు. అగ్ని పర్వతాలు ప్రేలుటవల్ల వచ్చిన బూడిద, గంధక సంబంధమైన గాసు సుమారు 50 మీటర్ల లోతుగా నీటిలో ఉన్న ఈ ఓడలో పింగాణీ వస్తువులను, ఓడను భద్రపరచాయి.

## క్షీణించిపోతూన్న అడవులు



భారతదేశంలో అడవులు సంవత్సరానికి 1.3 మిలియన్ హెక్టేరుల చొప్పున క్షీణించి పోతున్నాయి.

# ఆరోగ్యానికి చిట్కాలు

## ముఖంమీద మొటిమలు

బాల్యంలో నుంచి యౌవ్వనంలోకి వచ్చిన వారిలో కొంతమందికి సామాన్యంగా ముఖం మీద మొటిమలు బయలుదేరుతాయి. ముఖాన్ని అందవికారం చేస్తాయి. కొద్దిగా మిరియాలు వేపాకుతో మెత్తగా నూరి మంచి గంధంలో కలిపి రాత్రి పడుకునేటప్పుడు ముఖానికి రాసుకుంటుంటే ముఖంమీద మొటిమలు పోయి ముఖం కళ కళ లాడుతూంటుంది.

* * *



## జలుబులు - ఒంటి నొప్పులు

సామాన్యంగా జలుబులతోను, ఒంటి నొప్పులతోను బాధపడివారుందరు. కొద్దిగా తులసిదళాలను మిరియాలతో కలిపి మెత్తగా నూరి, చిన్న చిన్న మాత్రలు చేసుకుని ఆ మాత్రలు తీసుకుంటే ఒంటినొప్పులు తగ్గిపోతాయి. జలుబు తీసిపోతుంది.

* * *

## దగ్గుకు మందు

పొడిదగ్గు, తడిదగ్గు పట్టుకుంటే రాత్రి నిద్ర కూడా చెడిపోతుంది. ఒక పోకచెక్క తులసిదళాలతో నూరి ఆ ముద్దను నోటిలో పెట్టుకుని రసం మింగుతూంటే దగ్గు తగ్గుతుంది. హాయిగా నిద్రపడుతుంది.

* * *

## కడుపులో క్రిములకు

సాధారణంగా పిల్లలకు, పెద్దలకు కూడా కడుపులో క్రిములు బయలుదేరతాయి. కొద్దిగా పసుపుపొడి, వేపాకు చిగుళ్ళు మెత్తగా నూరి మాత్రలు చేసుకుని వేసుకుంటే కడుపులో పురుగు నశిస్తుంది. జీర్ణకోశం శుభ్రపడుతుంది.

* * *

## కళ్ళమంట

కళ్ళు ఎరుపెక్కి మంట పెడుతుంటాయి. అలాటప్పుడు రాత్రి పడుకునేటప్పుడు కొద్దిగా ఆముదం కళ్ళకు రాసుకుని పడుకుంటే మంటలు తగ్గిపోతాయి. పొద్దుటికి కళ్ళు తేటగా ఉంటాయి.

* * *

## ఒంటిమీద దురదలు

ఒంటిమీద దురదలకు స్నానం చేసేటప్పుడు నీళ్ళలో కొద్దిగా నిమ్మరసం పిండి స్నానం చేయండి. దురదలు ఇట్టే తగ్గిపోతాయి.

* * *

(మిగతా 54 వ పేజీలో)

# భారతదేశం సాధించిన సాధనలు

స్వీయం సంపూర్ణతతో ఆహారధాన్యాల ఉత్పత్తి మూడు రెట్లు పెరిగింది.

70 శాతం గ్రామాలకు విద్యుత్ సౌకర్యం కల్పించబడింది.

విద్యుచ్ఛక్తి ఉత్పాదన 20 రెట్లు పెరుగుదల సూచించింది.



స్వాతంత్ర్యానికి పూర్వం అనేక మరణాలకు కారణమైన మశూచి, ప్లేగు వ్యాధులు పూర్తిగా నివారింపబడ్డాయి.

మానవ జీవిత పరిమాణం 32 నుంచి 55 కి పెరిగింది.

విద్యార్థులు పాఠశాలలో అధికంగా చేరటంవల్ల అక్షరాస్యత రెట్టింపు కంటె అధికంగా పెరిగింది.

ఉక్కు ఉత్పాదన తొమ్మిది రెట్లు, అల్యూమినియం ఉత్పాదన 70 రెట్లు పెరిగింది.

ముడినూనె ఉత్పాదన 120 రెట్లు పెరిగింది.

బొగ్గు ఉత్పాదన 5 రెట్లు పెరిగింది.

సంవత్సరానికి రూ. 3,460 కోట్ల విలువ గల ఎలక్ట్రానిక్ వస్తువులు ఉత్పాదింపబడుతున్నాయి. 'ఇండియా మేడ్' ఇంజనీరింగ్ వస్తువులు, ఇతర పరికరాలవల్ల ఏటా రూ. 760 కోట్లు విదేశమారకం లభిస్తుంది.

అభివృద్ధి పొందిన ఎనిమిది దేశాలలో భారతదేశం ఒకటిగా ఉంటూ న్యూక్లియర్ ప్యూయెల్ టెక్నాలజీలో నైపుణ్యతను సాధించింది.

గత కొద్ది సంవత్సరాలలోనే సుమారు 10 కోట్లమంది దారిద్ర్యరేఖ పైకి తీసుకురాబడ్డారు.

తన స్వంత ఉపగ్రహాన్ని స్వంత రాకెట్ తో పంపిన దేశాలలో భారతదేశం ప్రపంచంలో 7వ దేశంగా పరిగణించబడింది.

మాన్డ్ స్పేస్ ఫ్లైట్ యుగంలో భారతదేశం 1984 లో ప్రవేశించింది. భారతదేశపు

(మిగతా 49 వ పేజీలో)

## మీరైతే....?

(జనవరి 1989)

('వివేకి దేశాటనం చేస్తే అవివేకి దేశసంచారం చేస్తాడు' అంటే?)

"అందుకే జ్ఞానానికి, అజ్ఞానానికి అక్షరాల తేడా ఉందంటారు."

—సీ౦ శ్రీనివాస్, మిరుదొడ్డి.

* * *

"బ్రతుకు తెరువు కోసమూ, పార్టీ ప్రచారం కోసమూ"

—వి. ఎస్. మూర్తి, కాకినాడ.

# కలం స్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురింపబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరుద్వారా పంపండి. —సంపాదకుడు.]

1. మహమ్మద్ సయీద్ పాషా, తొమ్మిదవ తరగతి, జిల్లా ప్రజాపరిషత్ స్కూల్, లక్ష్మీపూర్, వెలవ్ వయా, జగిత్యాల తాలూకా, (కరీంనగర్ జిల్లా) 505 529.

2. ఎమ్. రాజేష్, VIII తరగతి, 13 సం.లు., నవోదయా విద్యాలయ, నిజాం సాగర్, నిజామాబాద్, (బాన్స్‌వాడ తాలూకా) 503 302.

జనరల్ నాలెడ్జి, బాడ్మింటన్, సైన్సు పుస్తకాలు చదవడం.

3. బిందూకిరణ్, 18 సం.లు, 1-9-2/A, గోపాలపురం, సూర్యాపేట.(నల్గొండ జిల్లా) 508 213.

కవితలు, విజ్ఞాన చర్చలు, ఫిలాసఫీ.

4. శ్యాంసెనగల్. బి.ఎ (లిట్), 20 సం.లు, C/o నయీమ్, గోపాల్‌పూర్, సూర్యాపేట 508 213.

ఫిలాసఫీ, థియాలజీ, రచన, బోధన.

5. సి.శ్రీనివాస్, ఎల్‌సిఇ (ఎఎమ్‌ఐఇ), ఇం. నెం. 3-7-23, రవీంద్రనగర్ స్ట్రీట్, మహబూబ్‌నగర్-509 001.

కార్టూన్స్ వేయడం, పాటలు వినడం, ఫొటోగ్రఫీ.

6. క్రాంతికిరణ్, బి.ఏ. (లిట్) ఫ్రీలాన్స్ జర్నలిస్టు, 24 సం.లు. 1-9-2 గోపాలపురం, సూర్యాపేట (నల్గొండజిల్లా) 508 213.

జర్నలిజం, స్నేహమే లక్ష్యం, ఆంగ్ల సాహిత్యం.

## గాంధీమహాత్ముని పసిడిపలుకులు



GANDHIJI

శాంతి మార్గమే సత్య మార్గము.

పరమాత్ముడు నియమించిన కాలానికి అవరోధం లేదు.

సంతృప్తి నా అమూల్యమైన స్వార్జితం.

ప్రార్థనకు ప్రసంగం అనవసరం.

ధైర్యం లేనివారు శీలవంతులు కాలేరు.

సర్వ కళాతీతము జీవితం.

మానవుని వివేకం కంటే గొప్పది సత్యము.

"దైవదర్శనం చేసుకునే భక్తునికి గల ఆనందాను

# సుప్రసిద్ధ రచయితలు

## కణ్ణదాసన్

తమిళనాడు రామనాథపురం జిల్లాకు చెందిన శిరుకూడల్పట్టి గ్రామంలో ఒక పేద కుటుంబంలో 24 జూన్ 1927 న ఎనిమిదవ కాన్పులో జన్మించిన కణ్ణదాసన్‌కి అధిక విద్యావకాశం లభించలేదు. కారైకుడికి చేరువగా ఉన్న అమరావతి పుదూరులో చిన్న



KANNADASAN

పాఠశాలలో ఎనిమిదవతరగతి వరకు చదువుకున్నాడు. స్కూలు జీతం కూడా కట్టుకోలేని బీదరికంవల్ల విద్యాభ్యాసం మానుకున్నాడు.

మిక్కిలి చిన్నవయస్సులోనే కణ్ణదాసన్ తమిళ రచనలలోను, తమిళ వాఙ్మయంలోను అభిలాషను, ఆసక్తిని ప్రదర్శించి అనేక రచనలను ప్రారంభించాడు. ఇతడు రచించిన మొదటి పాట పుదుక్కోట నుంచి వెలువడే 'తిరుమగళ్' అనే తమిళపత్రికలో అచ్చైంది. ఆనాటి నుండి అనేక సుప్రసిద్ధ తమిళ మాసపత్రికలకు వ్రాయడం ప్రారంభించాడు. రచయితగా ఇతడు పేదరికంతో పడరాని పాట్లుపడ్డాడు. తరువాత కొంతకాలానికి ఇతడు సేలంలో ఆనాడు మిక్కిలి ప్రసిద్ధి పొందిన మోడరన్ థియేటర్స్‌వారి కథా రచనా విభాగంలో చేరాడు.

కథారచయితగా ఇక్కడ కణ్ణదాసన్ ప్రొడ్యూసర్ల ఆదరాభిమానాలను సంపాదించాడు. అతడి రచనా నైపుణ్యాభివృద్ధికి వారు తగిన అవకాశాలు కల్పించారు. 1949 లో 22వ ఏట కణ్ణదాసన్ మొట్టమొదట జూపిటర్స్ వారి తమిళ చిత్రం 'కన్నియిన్ కాదలి' అనే చిత్రానికి పాటలు వ్రాశాడు.

గొప్ప రచయితగా కణ్ణదాసన్ సమాజంలో వెనుకబడినవారి అభ్యున్నతికి పాటుపడుతూ, సాంఘిక సంస్కరణలకు పూనుకున్నాడు. తమిళ వాఙ్మయంలో గద్య పద్య

### పాఠకుల అభిప్రాయాలు

"సంతోషంతో సాగిస్తే సంసారం
సమస్యలతో సాగిస్తే విషసాగరం."

— సిల శ్రీనివాస్, మిరుదొడ్డి.

* * *

"వాపు బలుపు ఒకటి కాదు
వాసి రాశి ఏకం కాదు."

— సి. మోహన్‌రావు, శ్రీకాళహస్తి.

"వేదికలపై హరికథలు చెప్పే హరిదాసులకు

రచనలకు ఒక నూతన పరిమాణాన్ని రూపొందించి ప్రమాణాలను అధికం చేశాడు. పెద్ద నగరాలలో, తమిళనాడు కుగ్రామాలలో నివసించే పాఠకజనం ఇతడి పాటలను ఆనందంగా పాడుకుంటారు. ఋతువులలో కలిగే మార్పులు, గ్రామాలలో చక్కని సహజ దృశ్యము, మానవ జీవితంలో సుఖసంతోషాలు మొదలైనవి కణ్ణదాసన్ పాటలలో ముఖ్య విషయాలు. కణ్ణదాసన్ 5,000 పైగా సినీమాపాటలు, 4,000 పద్యాలు రచించాడు. 21 నవలలు, హిందూ ధర్మంమీద 10 సంపుటాల వ్యాసాలు అన్నీ చేరి 109 గ్రంథాలను రచించాడు.

ఇతడు రచించిన 'అదవందవర్ గళ్' అనే మొట్టమొదటి పుస్తకానికి రూ. 30 లు లభించింది. 1964 లో రచించిన ఇతడి మొట్టమొదటి నవల 'ఈళత్తురాణి' తమిళ వాఙ్మయంలో మిక్కిలి ప్రసిద్ధి పొందింది. ఇతడి స్వీయచరిత్ర 'వనవాసం' సరళమైన సులభశైలిలో రచింపబడింది. ఇతడు రచించిన 'గీత, బైబిల్' అనేకమంది భాషాభిమానుల ప్రశంసలను పొందాయి.

ఇతడు రచించిన 'అళగి' (అందగత్తె) అనే పద్యం 1956-57 లో 14 భాషలలోకి అనువదింపబడింది. 'విళక్కు మట్టుమా శివప్పు', 'పుష్పమాలిక' అనే నవలలు మళయాళంలోకి అనువదింపబడ్డాయి. కేరళ దేశీయుల అభిమానాన్ని పొందాయి. ఇతడి చిన్నకథల సంపుటి కన్నడంలోకి అనువదింపబడింది. ఇది కర్ణాటకలో స్కూలు విద్యార్థులకు పాఠ్యపుస్తకంగా నిర్ణయింపబడింది. 'ది బైబిల్' అనే గ్రంథాన్ని అవలీలగా 16 రోజులలో ముగించాడు. 'అంబిగై అళగు దర్శనం' అనే 100 భక్తి పాటలతో కూడిన గ్రంథం 4 గంటలలో రచించాడు.

కణ్ణదాసన్ ఎంత గంభీరంగా వ్రాస్తాడో అంత గంభీరంగా ఉపన్యాసాలు ఇచ్చేవాడు. 'చేరమాన్ కాదలి' అనే కణ్ణదాసన్ నవలకు సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. 1978 వ సం. లో ఇతడు తమిళనాడు పొయెట్ లారెట్ గా నియమింపబడ్డాడు.

## చరిత్ర కాలానికి పూర్వపు కవర్‌లిజర్డ్‌కి సెకండ్ బ్రెయిన్




చరిత్రపు కాలానికి పూర్వపు జంతువు 'స్టెగోసరాస్' (Stegosaurus) నే 'కవర్ లిజర్డ్' అంటారు. దీనికి వీపుమీద దట్టమైన రెండు ఎముకల వరుస లుంటాయి. ఇవి తల వెనుకభాగం నుంచి తోక చివరిదాకా ఉంటాయి. ఆ తోకకి నాలుగు వాడియైన ముళ్ళు ఉంటాయి. ఎముకలు, తోక చివరి ముళ్ళు జంతువుని సంరక్షిస్తాయి. దీని వెనుక కాళ్ళు చాలా నిడివిగా ఉంటాయి. ముందు కాళ్ళు పొట్టిగా ఉంటాయి. తల మిక్కిలి చిన్నది. దీని మెదడు దవడలను, ముందుకాళ్ళను నియంత్రిస్తుంది. దీనికి నడుం దగ్గర సెకండ్ బ్రెయిన్-కేంద్రనాడీ మండలం ఉంటుంది. ఇది దీని వెనుక కాళ్ళను, తోకను నియంత్రిస్తుంది.

# మన ఆహారంలో కూరగాయలు

డా. డి.ఎస్. భీమా

మనం తినే ఆహారంలో కార్బోహైడ్రేటులు, మాంసకృత్తులు, క్రొవ్వులు, లవణాలు, ఖనిజాలు, విటమినులు క్రమమైన పాళ్ళలో ఉండాలి. సాధారణంగా పళ్ళలో తప్ప ఇతర అనేక పదార్థాలలో లోపించిన



పై పదార్థాలన్నీ మనం ప్రతిరోజూ ఆహారంలో తినే కూరగాయలలో లభిస్తాయి. ఇవి శరీరంలో నరములు, దంతములు, ఎముకల పటుత్వానికి, రక్తవృద్ధికి, వ్యాధులను తట్టుకోడానికి చాలా అవసరం.

జీర్ణకోశములో మాంసకృత్తులు, క్రొవ్వులు జీర్ణమగునప్పుడు శరీరారోగ్యానికి హానిచేసే కొన్ని ఆమ్లాలు జనిస్తాయి. వీటిని విరిచి రక్తంలో కావలసినంత క్షారములను నిలువచేయడానికి కూరలు చాలా ఉపయోగపడుతున్నాయి. కూరగాయలలోను, ఆకుకూరలలోను ఉండే మెత్తటిపీచు సెల్యులోజు మలబద్ధాన్ని నిరోధించి జీర్ణాభివృద్ధికి తోడ్పడుతుంది. బంగాళాదుంప చిలకడదుంప లేక ఎర్రదుంప మొదలైనవాటిలో లభించే పిండి పదార్థాలు (కార్బోహైడ్రేటులు) మనకు పటుత్వాన్ని కలిగిస్తాయి. బఠాణీ, చిక్కుడుజాతి గింజలలో మాంసకృత్తులు (ప్రోటీనులు) లభిస్తాయి

మానవ శరీరం ఆరోగ్యంగా, సక్రమంగా పనిచేస్తూ ఉండడానికి అధమం పది రకాల ఖనిజాలు అవసరం. సాధారణంగా కాల్షియం (సున్నము), భాస్వరం, ఇనుము మన ఆహారంలో లోపించి ఉంటాయని పరిశోధనలవల్ల ఋజువైంది. కాబేజి, కాలిఫ్లవర్, బటానీలు, చిక్కుడు జాతి గింజలు, కారట్లు, టొమాటోలు, బచ్చలికూర, తోటకూర, ఉల్లిపాయ మొదలైన వాటిలో కాల్షియం సున్నం) అధికంగా ఉంటుంది. బచ్చలి, తోటకూర, టొమాటో, బంగాళదుంప, కాలిఫ్లవర్, దోస మున్నగు వాటిలో భాస్వరం అధికంగా ఉంటుంది. తాజా ఆకుకూరలలోను, చిక్కుడు, బఠాణి, టొమాటో, బంగాళదుంప కాబేజీ మున్నగు వాటియందు శరీరానికి అవసరమైన ఇనుము లభిస్తుంది.

ముఖ్యంగా కాబేజి, బచ్చలి, తోటకూర, ఇంకా అనేక ఇతర ఆకుకూరలలో సీటి శాతం, పీచు అధికంగా ఉంటాయి. అందుచేత ఇవి వాడితే మలబద్ధత ఉండదు. జీర్ణశక్తి అభివృద్ధి పొందుతుంది.

పునరుత్పాదక శక్తితో శరీరారోగ్యాభివృద్ధికి విటమిను లనే రసాయనిక పదార్థాలు చాలా ముఖ్యం. ఏ రోగాలు లేకుండా కంటి ఆరోగ్యాభివృద్ధికి విటమిను A అవసరం. ఇది ముఖ్యంగా కారటుదుంపలు, తోటకూర,

బచ్చలికూర, కాబేజి, బటానీలు, టొమాటో, చిలకడ దుంపలలో లభిస్తుంది.

పెరుగుదలకు, బాలింతల క్షీరవృద్ధికి, ఆకలి పుట్టించడానికి, నంజువ్యాధి (Beriberi) నివారణకు B విటమిను ఆవశ్యకం. ఇది పచ్చి కాబేజి, బఠానీ, కాలీఫ్లవర్, తోట కూర, టొమాటో, చిలకడదుంపలలో లభి స్తుంది.

నోటి చిగుళ్ళ ఆరోగ్యానికి C విట మిను చాలా ముఖ్యం. ఇది స్కర్వీ వ్యాధు లను కూడా అరికడుతుంది. చిక్కుడు గింజలు, కాబేజి, కారట్, టొమాటో, బంగాళాదుంప మొదలైనవాటిలో C విట మిను అధికంగా లభిస్తుంది ఉడకబెట్టి తినడం కంటే పచ్చి కాయగూరలు తినడం చాలా మంచిది. ఉడకపెట్టడంవల్ల C విట మిను నశిస్తుంది. నెయ్యి, నూనె మొదలైన వాటితో వండినప్పుడు C విటమిను అంతగా నశించదు.

D విటమను రికెట్లను (ఎముకలు మెత్త బడి వంగిపోవడం) రానీయదు కాల్షియం (సున్నము), భాస్వరం, ఇతర లవణాలు సక్రమంగా శరీరంలో వినియోగపడడానికి D విటమిను సహకరిస్తుంది. పచ్చి బఠానీలు, బచ్చలి బంగాళాదుంప, పెద మిరపకాయలు (Capsicum), టొమాటో, టర్నిప్ దుంప లలో D విటమిను ఎక్కువగా లభిస్తుంది. బంగాళాదుంప, చిలకడదుంపలు, బఠానీలు, చిక్కుడుగింజలు మొదలైనవి మిక్కిలి శక్తి వర్ధకములు. వీటిలో అధికంగా కార్బొహైడ్రేటులు, ప్రొటీనులు (మాంసకృత్తులు) లభిస్తాయి.

ఆరోగ్యాన్ని కాపాడుకోవాలంటే శరీరంలో కావలసినంత క్షారాన్ని నిలువ చేసుకోవాలి. అధికంగా మాంసకృత్తులు ఉండే మాంసము, చీసు, గ్రుడ్డు మొదలైనవి క్షారాన్ని తగ్గించేస్తాయి. ఆకుకూరలు వృద్ధి పరుస్తాయి. కాబట్టి మనం ప్రతీరోజూ తినే ఆహారంలో ఆకుకూరలు ముఖ్యంగా వాడాలి.

—'హర్యానా రివ్యూ' సౌజన్యంతో

## చంద్రుడు లేని రాత్రి ఆకాశంలో 3,000 నక్షత్రాలను చూడగలం!



చంద్రుడు లేని రాత్రి ఆకాశంలో సాధారణ కంటితో 3,000 నక్షత్రాలను చూడవచ్చు. బైనాక్యులర్స్ సహాయంతో 1,00,000 నక్షత్రాలను చూడవచ్చు. యునైటెడ్ స్టేట్స్‌లో ఖగోళ శాస్త్రజ్ఞులు 200 అంగుళాల పాలోమార్ (Palomar) దూరదర్శిని సహాయంతో వెయ్యి మిలియను నక్షత్రాలను ఫోటో తీయవచ్చు.

# ఒప్పిలియప్పన్ కోవెల

ఎన్. రామకృష్ణ

తమిళనాడు తంజావూరు జిల్లాలో తిరునాగేశ్వరానికి 1½ కి.మీ.లు, కుంభకోణానికి 4½ కి.మీ. లు దూరంలో ఒప్పిలియప్పన్ దేవాలయం ఉంది. ఈ దేవాలయం గర్భగుడి పైన విమానాన్ని సుధానందం అంటారు.


OPPILIAPPAN TEMPLE

దీనికి సంబంధించిన స్థలపురాణం చాలా విచిత్రంగా ఉంటుంది. మార్కండేయ మహాముని ఉప్పును వర్జించి కాయలూ, పళ్ళూ తింటూ ఇక్కడ తపస్సు చేసుకునేవాడు. ఒకనాడు తన ఆశ్రమం దగ్గర ఒక అందమైన చిన్న ఆడపిల్ల కనిపించింది. అనాథగా ఉన్న ఆ బాలికను తీసుకువచ్చి భూమిదేవి అని పేరుపెట్టి పెంచి పెద్ద చేశాడు. భూమిదేవికి వివాహ వయస్సు ప్రాప్తించింది. తగిన వరుణ్ణి వెతకడం ప్రారంభించాడు. ఒక రోజున ఒక వృద్ధుడు వచ్చి ఆ పిల్లను వివాహం చేసుకుంటానన్నాడు. తన కుమార్తెకు వంట చేయడంరాదని, ఉప్పు ఉపయోగించడం అసలు తెలియదని, ఆశ్రమంలో ఉప్పును వర్జించానని మార్కండేయ మహాముని ఆ వృద్ధునితో చెప్పాడు. ఆ వృద్ధుడు దానికి అంగీకరించి భూమిదేవిని వివాహమాడాలని నిశ్చయించాడు. ఈ వృద్ధుడు సామాన్య మానవుడు కాదని ఆ ముని అనుకున్నాడు. భూమిదేవి కూడా ఆ వృద్ధుని వివాహం చేసుకుంటానని చెప్పింది.

ఇద్దరూ వివాహానికి అంగీకరించారు. ఇంతలో ఆ వృద్ధుడు మాయమై కనిపించలేదు. ఆ స్థలంలో సాక్షాత్ నారాయణుడు (విష్ణువు) కనిపించాడు. మునికి పట్టరాని ఆనందం కలిగింది. తన కుమార్తెను వివాహం చేసుకోవాలంటే ఆ ఆశ్రమంలోనే నివసించాలని, ఆ ప్రదేశం భగవంతుడైన విష్ణువు పేర ఉండాలని, అక్కడి భగవంతునికి పెట్టే నైవేద్యంలో ఉప్పు ఉపయోగించ

## 99.999 శాతం స్వచ్ఛమైన "గాలియం"

ఎలక్ట్రానిక్ పరిశ్రమలో కీలకమైన "గాలియం" (Gallium) ఉత్పాదనలో భారతదేశం గొప్ప విజయం సాధించింది. తమిళనాడు మెట్టూరులో మద్రాసు అల్యూమినియం కంపెనీ ప్లాంటులో లభించే బేయర్స్ లికర్ (Bayer's Liquor) నుండి దేశీయ సాంకేతిక విజ్ఞానంతో తయారు కాబడే గాలియం 99.999 శాతం స్వచ్ఛమైనదని కనుగొనబడింది.

కూడదని నియమాలు పెట్టాడు. దానికి విష్ణువు అంగీకరించాడు. అక్కడ వెలసిన విష్ణువే ఉప్పిలియప్పన్ (ఉప్పు ఇల్లై అప్పన్). అతడే ఒప్పు ఇల్లై అప్పన్. సాటి లేని దైవం.


SRI SRINIVASA PERUMAL

సంస్కృతంలో ఇచ్చట వెలసిన దేవుని లవణవర్జిత వేంకటేశుడు అంటారు. భక్తులు శ్రీనివాసుడు అని పూజిస్తారు. కలియుగ వైకుంఠం తిరుపతిలో వెలసిన వేంకటాచల పతికి ఈ శ్రీనివాసుడు పెద్దన్న అంటారు. తిరుపతి మొక్కులను ఇక్కడ తీర్చుకునే ఆనవాయితీ ఉంది. కానీ ఇక్కడ మొక్కులను తిరుపతిలో తీర్చుకోరు.

దేవాలయానికి చెందిన పుష్కరిణిని అహోరాత్రి పుష్కరిణి అంటారు. శ్రీనివాసుడు ఉద్భవించిన శ్రవణనక్షత్రం రోజున ఈ పుష్కరిణిలో స్నానాలుచేసి, భక్తులు శ్రవణ దీపాన్ని వెలిగిస్తారు. ఇక్కడ అమ్మవారు భూమిదేవి. మూలవిరాట్టు, ఇతర విగ్రహాలు ఇక్కడ చాలా గంభీరంగా, అత్యంత సుందరంగా ఉంటాయి.

## ఆరోగ్యానికి పది సూత్రాలు

జాన్ డి. రాక్‌ఫెల్లర్ మొదటి మిలియను సంపాదించినప్పుడు ఆశ్చర్యపడలేదు, తన వివేకవంతమైన యోజనను పూర్తిగా నమ్ముకున్నాడు. దానిమీద విశ్వాసం పెంచుకున్నాడు. 60 సంవత్సరాల వృద్ధుడయ్యేటప్పటికి 100 సంవత్సరాలు జీవించాలని దృఢనిశ్చయం చేసుకున్నాడు. దానికి తగినట్టుగా కొన్ని నిబంధనలను, సూత్రాలను విశ్వాసంతో అనుసరించాడు. ఈ నిబంధనలే ఆరోగ్యానికి పది సూత్రాలు.

* 'జీవితం' అన్నా, 'ప్రపంచం' అన్నా ఎప్పుడూ అభిరుచిని చంపుకో వద్దు.
* చాలా మితంగా సక్రమ కాలావధులలో ఆహారం తిను.
* మిక్కిలి అధికంగా కాకుండా కావలసినంత వ్యాయామం తప్పక చేయి.
* బాగా నిద్రపో.
* అనవసరంగా యాతనపడిపోకు.
* ప్రతిరోజూ నీవు చేయవలసిన పనులను నిర్ణయించుకో. వాటిని అనుసరించు.
* మంచి వెలుగులో సూర్యరశ్మిని సేవించుకో.
* నీవు త్రాగగలిగినంత పాలు త్రాగు.
* నీ వైద్యుని మాట మాటికి కలుసుకుని వారి సలహాలను పాటించు.
* అతి దేనికీ పనికిరాదు.

—'ది ప్రింటెడ్ వర్డ్' . (హెర్త్ అక్షన్ సౌజన్యంతో)

# మూడవతరం రాబోటులు

జపానువారి రాబోటులు మూడవతరంలోకి ప్రవేశించడానికి సిద్ధంగా ఉన్నాయి. 'ప్లేబాక్ రాబోట్లు' మొదటితరానికి చెందినవి. ఇవి కేవలం మానవులు నేర్పిన లేక ఉపదేశించిన పనులను మాత్రమే తిరిగి చేస్తాయి. రెండవ తరానికి చెందిన రాబోట్లు అదనంగా




ఇంద్రియ జ్ఞానంతో ప్రత్యేకంగా ముందు ప్రణాళికా బద్ధం చేసిన పనులను గ్రాహక శక్తి (perception)తో నెరవేరుస్తాయి.

ప్రస్తుతం జపానులో ఉపయోగిస్తున్న 1,00 000 పారిశ్రామిక రాబోట్లు ప్రపంచం మొత్తంమీద అన్ని రాబోట్లలో 70 శాతం. ఇవన్నీకూడా మొదటి తరానికో లేక రెండవ తరానికో చెందిన రాబోట్లు.

పరిసర పరిస్థితులను పరిశీలించడానికి కావలసిన బుద్ధి కుశలతతో, మానవుల సూచనలు, ఉపదేశాలు అవసరం లేకుండా మూడవ తరానికి చెందిన రాబోట్లు కొన్ని విషయాలలో మానవుని జ్ఞానశక్తికి సరిసమానంగా ఉంటాయి. ఇవి వాటంతటవే పనిచేసే సంక్లిష్ట యంత్రాలు కావు.

ప్రస్తుతం రాబోట్లు పరిస్థితులు ముఖ్యంగా స్థిరంగా ఉండే ఫాక్టరీల వంటి వాతావరణాలలో మాత్రమే పనిచేస్తాయి. అవసరమైనంత స్వవివేచనా లేక స్వవిమర్శనా శక్తితో వీటిని డిజైనుచేస్తే ఇవి ఎప్పటికప్పుడు పరిస్థితులు మారిపోతూండే సంకీర్ణమైన వాతావరణంలో కూడా పనిచేస్తాయి. ఇటువంటి రాబోట్లుచేసే పనులు లెక్కలేనన్ని ఉంటాయి. మానవులకు అనువుగా ఉండని క్లిష్టతర వాతావరణాలలో ఇవి పనిచేస్తాయి.

మినిస్ట్రీ ఆఫ్ ఇంటర్‌నేషనల్ ట్రేడ్ అండ్ ఇండస్ట్రీకి చెందిన ఏజెన్సీ ఆఫ్ ఇండస్ట్రియల్ సైన్స్ అండ్ టెక్నాలజీ

---

(12 వ పేజీ తరువాయి)

జించిన నాటికి ఇంకా ఫతేపూర్ సిక్రీ నిర్మాణం పూర్తికాలేదు.

ఈ సూఫీ భక్తుడు మరణించిన 14 సంవత్సరాలకు అక్బరు అతడి అనుచరులు ఫతేపూర్ సిక్రీ వదిలేసారు. తిరిగి వారు ఇక్కడికి రాలేదు. ఇచ్చట ఏర్పడిన నీటి కొరతవల్ల జనం అందరూ దీనిని వదిలిపెట్టవలసి వచ్చింది. అకస్మాత్తుగా ఫతేపూరు సిక్రీ పాడుబడిపోయిన ఊరైంది. నక్కలు, పాములు, ఇతర అనేక జంతువులకు ఇది నివాసమైంది.

ఇప్పటికీ పాడుబడిపోయిన ఈ ఊరికి విలాసయాత్రికులు వచ్చి బ్రహ్మాండమైన ఫతేపూర్ సిక్రీ చారిత్రక సౌందర్యాన్ని ఫొటోలు తీస్తూంటారు.

విభాగం వారు 20 బిలియన్ ఎన్నుల వ్యయంతో "ఎక్స్ట్రీమ్ ఆపరేషన్ రాబోటు" (Extreme Operation Robot) ను అభివృద్ధి చేస్తున్నారు. ఈ యోజన క్రింద ముఖ్యంగా మూడు రకాల మూడో తరం రాబోటులను తయారు చేస్తారు.

1. న్యూక్లియర్ పవర్ ప్లాంట్ మధ్య రేడియేషన్ పరిమాణం అత్యధికంగా ఉండే ప్రదేశాలలో ఉపయోగపడే రాబోట్లు.

2. సముద్రాలలో నీటి అడుగున వనరుల అన్వేషణకు మరియు సేకరణకు ఉపయోగపడే రాబోట్లు.

3. అగ్ని ప్రమాదాలలో మంటలు పెరిగి వ్యాపించి. అపారనష్టం ఏర్పడకుండా చేసి



THREE FINGER ROBOT HAND

మానవుల ప్రాణాలను సంరక్షించడానికి రాబోట్లు.

ఇటీవల టొహొకు యూనివర్శిటీ (Tohuku University) మరియు హోండా స్కియికీ కంపెనీ సమిష్టిగా చేరి రూపొందించిన రాబోట్ క్రాబ్ (Robot Crab) కూడా ఎక్స్ట్రీమ్ ఆపరేషన్ రాబోటు. ఇది సముద్రంలో భూగర్భంమీద ఉన్న మాంగనీస్ గుళికలను కనిపెట్టి సేకరిస్తుంది. దీనికి సంబంధించిన అసలు ఓడ మీదినుంచి దూర నియంత్రణవల్ల ఇది పనిచేస్తుంది.

ఇంకా అధికంగా అపాయకరమైన పరిసరాలలో మానవులకు సహాయపడి వాళ్ళకు విమోచనం కలిగించడానికి మరోరకం క్రొత్త రాబోటును కూడా తయారుచేస్తున్నారు.

మూడవతరం రాబోట్లు మానవులతో అనుగుణ్యంగా పొందికపడి ఉండడం ముఖ్యం. మానవ సమాజంలో వ్యక్తులతో చనువుగా, సరళంగా మెలిగేటట్లు వీటిని తయారుచేయాలి. ఒసాకాలో సాబోటాచీ



A ROBOT TALKING TO AN ADMIRER

కాఫీ షాపులో పనిచేసే రాబోటు కాతాదారులతో మామూలు సర్వర్లకంటే ఎంతో చనువుగా, ఆప్యాయంగా ఉంటుంది. 'సాగా మెడికల్ స్కూల్' లో "రాబోటు నర్స్" పిల్లలకు పీడియాట్రిక్ వార్డుకి దారిచూపిస్తుంది. వాళ్ళ కేసు రికార్డులను తీసుకువెడుతుంది.

—'జపాన్ టుడే' సౌజన్యంతో

**భారతదేశపు మొట్టమొదటి ఫిల్మ్ జర్నల్**

భారతదేశంలో మొట్టమొదటి ఫిల్మ్ జర్నల్ (సినిమా పత్రిక) 'మూవీ మిర్రర్' 1927 లో ప్రారంభమైంది. శ్రీ ఎస్. కె. వాసగమ్ దాని సంపాదకుడు.

# సాధకుల సాధనా మర్మము

మార్టాన్ హంట్

ఛార్లెస్ గార్‌ఫీల్డ్ శాన్‌ఫ్రాన్సిస్‌కో కాలిఫోర్నియా మెడికల్ కాలేజీలో అసోసియేట్ ప్రొఫెసరు. బెర్క్‌లీలో పీక్ పర్‌ఫార్మెంన్స్ సెంటర్ (Peak Performance Centre) అనే పరిశోధక సంస్థను స్వంతంగా స్థాపించాడు. ఇతడు వివిధ



రంగాలలో 1.500 మంది అపూర్వ సాధకులను పరిశీలించాడు. వీరందరికీ సహజంగాలేని ప్రత్యేకంగా నేర్చుకున్న గుణాలు కొన్ని ఉన్నాయి. ఇటువంటి మహోన్నత గుణాలను అందరూ అలవాటు చేసుకోవచ్చు; అందరూ గొప్ప గొప్ప సాధకులు కావచ్చు.

గార్‌ఫీల్డ్ పరిశోధనా ఫలితాలే ఇక్కడ సూచింపబడ్డాయి.

సరళంగా జీవించు: చాలా మంది దీక్షతో పనిచేస్తారు. అటువంటి వారు ఆఫీసు పనిని ఇంటికి తెచ్చుకుని రాత్రి పడుకునే దాకా దాంతో తంటాలు పడుతూంటారు.

గార్‌ఫీల్డ్ ప్రకారం ఇది సక్రమమైన మార్గం కాదు. ఇటువంటి వాళ్ళు ఒక్కసారి పైకిలేచి అకస్మాత్తుగా క్రిందికి జారి పడిపోతారు. ఫలితాలు కాదు పనే వాళ్ళ జీవితం అని అనుకుంటారు.

గార్‌ఫీల్డ్ ముఖాముఖీ, ప్రత్యక్షంగా పరీక్షచేసి చెప్పారు. అసలైన సాధకులకు ఎలా శ్రమ తీర్చుకోవాలో తెలుసు. వారికి విశ్రాంతి తీసుకోడం తెలుసు. ఆఫీసుపని ఆఫీసులోనే వదిలేస్తారు. స్నేహితులను, కుటుంబసభ్యులను అభినందిస్తారు. ఆప్తులతోను. తమ పిల్లలతోను గడుపుతూ కాలాన్ని ఆరోగ్యవంతంగా, ఉల్లాసవంతంగా చేసుకుంటారు.

భద్రంగా పదిలం అనుకున్న పనినే చేపట్టు: ఇష్టంలేని ఉద్యోగంచేస్తూ వారానికి 5 రోజులు కష్టపడిపోతూ జాక్ 30 ఏళ్ళు గడుపుకు వచ్చాడు. జీతం రాళ్ళకు ప్రాధేయపడేవాడు. జీవితంలో అనుకున్నది సాధించలేకపోయాడు. జాక్ వాస్తవంగా

(39 వ పేజీ తరువాయి)

అంతరిక్షనౌకాయోధుడు రాకేష్‌శర్మ సోవియెట్ యూనియన్ వారి సాల్యుట్-7 (Salyut-7) స్పేస్ స్టేషన్‌లో దిగ్విజయంగా ప్రయాణం సాగించాడు.

యునైటెడ్ స్టేట్స్, సోవియెట్ యూనియన్‌ల తరువాత భారతదేశం వైజ్ఞానిక మరియు సాంకేతిక శక్తికి మూడవ స్థానాన్ని పొందుతుంది.

ప్రపంచంలో మొదటి 10 పారిశ్రామిక దేశాల జాబితాలో భారతదేశం ఒకటైంది.

తాను అనుకున్నట్లు పిల్లల పుస్తకాలు ఎడిట్ చేసి ఉంచే ఎంతో విజయం సాధించి సంతోషంగా జీవించేవాడు.

గొప్ప గొప్ప సాధకులమని అనిపించుకునేవారంతా వారి కిష్టమైన పనినే ఎన్నుకుంటారు. వారు చేసే పనిలో వారికి సంతోషం, ఆనందం కలుగుతుంది. మంచి ఫలితాలను, లాభాలను పొందుతారు. విజయం పొందుతారు.

ప్రతికష్టమైన పనిని ఎలాచేయాలో మానసికంగా రిహార్సుచేసుకో: కష్టమైన సందర్భాలలో బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల మీటింగులో లేక బహిరంగ సభలో మాట్లాడవలసి వచ్చినప్పుడు అందరూ మానసికంగా ముందు అనేకసార్లు రిహార్సలు చేసుకుంటారు.

ఫలితాలను ఆశించు: ప్రత్యాశాపరులంతా తలపెట్టిన పని అన్నివిధాల సరిగ్గా చేయాలనే ఉబలాటంతో చివరకు అసలు పనిని ముగించలేరు. సర్వోత్తమ సాధకులైన వారంతా గార్ఫీల్డ్ ప్రకారం తమ పొరపాట్లను అపజయాలనుకోరు. వాటివల్ల కలిగిన అనుభవంతో మరోసారి బాగా చేయవచ్చని ధైర్యం తెచ్చుకుంటారు.

సాహసించడానికి వెనుకాడకు: కొందరు ఎంత విసుగు కలిగించే పనైనా భద్రతకోసం పాటుపడతారు. చేపట్టిన పని సాధించలేకపోతే ఏం జరుగుతుందని ఊహించరు. గొప్ప సాధకులు అలాగాక ముందు జాగ్రత్తపడి అవసరమైనప్పుడు జీవితంలో పరిస్థితులను ఎలా అనుకూలంతం చేసుకోవాలో తెలుసుకుని ప్రవర్తిస్తారు.

సామర్థ్యాలను తక్కువ మదింపు చేసుకోరు. మనలో చాలామంది మనహద్దులు

## మొట్టమొదటి 'జూ' 1150 బి.సి.లో ప్రారంభమైంది



1150 బి.సి. లో మొట్టమొదటి 'జూ' (జంతు ప్రదర్శనశాల) చైనా చక్రవర్తి స్థాపించారు. ఇక్కడ దుప్పులు, లేళ్ళు, పక్షులు, చేపలు రకరకాల జంతువులు ప్రదర్శింపబడేవి. చక్రవర్తి మరియు ఇతర గొప్ప గొప్ప జమీందారుల వినోదానికి ఇది ప్రారంభింపబడింది. ప్రజల కోసం మొట్టమొదటి 'జూ' 1793 లో పారిస్ (ఫ్రాన్స్) లో ఏర్పాటు కాబడింది. దీంట్లో జంతువులు ప్రదర్శింపబడేవి. ఇందులో ఒక మ్యూజియం, బొటానికల్ గార్డెన్స్ కూడా ఏర్పాటు చేశారు. తరువాత జూ 1828 లో లండన్ (ఇంగ్లండ్)లో ప్రారంభమైంది. ఆ తరువాత బెర్లిన్ (జర్మనీ)లో ప్రపంచంలో ప్రఖ్యాతమైన జూ నిర్మింపబడింది.

మనకు తెలుసును అనుకుంటాం. అదంతా వివేకం ఉపయోగించి తెలుసుకున్నది కాదు. పట్టి భ్రమమీద ఆధారపడ్డదే సెల్ఫ్ లిమిటింగ్ బిలీఫ్‌వల్ల సాధించవలసినది సాధించలేక పోతాం. నాలుగు నిమిషాలకంటె తక్కువ కాలంలో ఒక మైలు దూరం పరుగెత్తడం అసంభవం అని చాలాకాలం అనుకునేవారు. తరువాత 1954 లో రోజర్ బానిస్టర్ నాలుగు నిమిషాలలో ఒక మైలు పరుగెత్తి అసంభవం కాదని నిరూపించాడు. తరువాత రెండేళ్ళలో మరో పదిమంది కూడా పరుగెత్తి సాధ్యం అని నిరూపించారు.

మనకు ఈ హద్దులు అసలు తెలియవు. మనలో చాలామంది మన ప్రత్యేక అవధులను, అంతరాలను వాస్తవమైనవానికన్నా చాలా తక్కువగా నిర్ణయించుకుంటాం. సాధకులనిపించుకునేవారు శక్తిసామర్థ్యాలను ఏకాగ్రం చేసుకుంటారు. ఉత్తమ ఫలితాలను సాధిస్తారు.

**నీతో నువ్వు పోటీపడు:** ఇతరులతో కాదు. నీతో నువ్వు పోటీపడు. అద్భుతమైన సాధకులందరూ ఇతరులతో పోటీపడి వాళ్ళమీద విజయం సాధించడంకంటే తమ పూర్వ ప్రయత్నాలను అభివృద్ధిచేసుకోడానికి ప్రయత్నిస్తారు.

నీ అలవాట్లను మార్చుటానికి అపూర్వమైన నైపుణ్యాలను అలవరచుకోడానికి నీకు సామర్థ్యం ఉంది. నీవు చేయాలనుకుంటే నువ్వు ఇంతకంటే బాగా చేయగలవు. ఉత్తమ విజయాలను సాధించగలుగుతావు. నీ పూర్తి జీవితాన్ని మార్చుకోగలుగుతావు.

'హిప్నాటిక్' సౌజన్యంతో

## ప్రపంచంలో మిక్కిలి ఎత్తుగా ఉండే 'సెల్ఫ్ - సపోర్టింగ్ టవరు'




కెనడా టొరాంటోలో మెట్రో సెంటర్‌లో 555.33 మీటర్ల ఎత్తు గల కెనడియన్ నేషనల్ టవర్ 44 మిలియను డాలర్లు వెచ్చించి నిర్మించబడింది. 1,30,000 టన్నుల రెయిన్‌ఫోర్స్‌డ్ కాంక్రీటు ఉపయోగించిన దీని నిర్మాణం 1973 ఫిబ్రవరి 12 న ప్రారంభమైంది. పైన అంటెనా విభాగం 1975 ఏప్రిల్ 2 న ఈ టవర్ మీదకు మెల్లిగా ఎత్తబడింది. బ్రహ్మాండమైన సికోర్‌స్కీ హెలికాప్టర్ ఒక్గా దీనిని ఎత్తింది.

416 సీట్లతో ఉండే రెస్టారెంట్ 347.5 మీటర్ల ఎత్తున తిరుగుతూంటే ఇచ్చట నుంచి 120 కి.మీ.ల దూరంలో ఉండే కొండలను కూడా చూడవచ్చు. 447 మీటర్ల ఎత్తుమీద ఉన్న పబ్లిక్ అబ్జర్వేషన్ డెక్ మీద నుంచి ప్రకృతిని పరిశీలించవచ్చు.

—ఎడవల్లి చంద్రశేఖర్

# వన్యమృగ సంరక్షణ

మిస్ టి. అనిత

ఈనాడు వన్యమృగాలను సంరక్షించడం ఎంతైనా అవసరం. అనేక అడవి జంతువుల జాతులు పూర్తిగా అంతరించిపోయే భయంకర పరిస్థితులలో ఉన్నాయి. గత 10-20 సంవత్సరాలలో అడవులలో ఎన్నో



మృగాలు వాటి శరీరం మీది బొచ్చుకోసం నిర్దయగా అతిక్రూరంగా చంపబడ్డాయి. ఇటీవల అడవి మృగాల పరిస్థితులను పరిశీలించి, వాటి సంరక్షణ ముఖ్యమని గ్రహించి వన్యమృగ సంరక్షణా కేంద్రాలు ఏర్పరచారు. కాని చీటా (చిరుతపులి), స్వాన్ (హంస) వగైరా జంతువులు పూర్తిగా అంతరించిపోయాయి.

ప్రకృతి జంతుజాలంలో సమతౌల్యతను ఏర్పరుస్తుంది. వివిధ జాతుల ప్రవృద్ధిని మెల్లిగా కలిగిస్తుంది. కానీ మానవుడు వాటిని వివేచనలేకుండా చంపుతున్నాడు. దీంతో అవి పూర్తిగా అంతరించే పరిస్థితులు ఏర్పడ్డాయి.

అడవి మృగాలు లేకుండా ప్రపంచం ప్రవృద్ధి పొందలేదు. అంతరించిపోయే జంతువులు సంరక్షింప బడకపోతే కుందేళ్ళ వంటి జంతువులు మానవ మనుగడకే ప్రమాదాన్ని కలిగిస్తాయి. ప్రకృతిలో మానవుడు జీవించలేనంత వరకు సమతౌల్యత వశిస్తుంది.

(19 వ పేజీ తరువాయి)

విద్యావ్యాప్తియందు ఆసక్తి అధికం. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఆ రోజులలో తన జమిందారీ నుండి ఒక లక్షరూపాయల ఆదాయము వచ్చు ఏర్పాటు చేసాడు. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు వీరికి డా. లిట్ పట్టమును ఇచ్చారు. జీవితాంతము ఆంధ్రవిశ్వవిద్యాలయానికి ప్రో ఛాన్సలర్‌గా ఉన్నాడు. విశ్వవిద్యాలయంలో సైన్సు టెక్నాలజీ కళాశాలకు వీరి పేరు పెట్టబడింది.

* * *

**అలాన్ బ్లూమ్‌లిన్ (1903-1942):**

సుప్రసిద్ధ బ్రిటిషు పరిశోధకుడు. ఇతడు 1931 లో గ్రామఫోను రికార్డు నుంచి (స్టీరియో ఫోనిక్ సౌండ్) శబ్దాన్ని పునరుత్పాదించే విధానాన్ని కనిపెట్టి పేటెంట్ చేశాడు. 405-లైన్ టెలివిజన్‌ను అభివృద్ధి చేయడానికి కూడా సహకరించాడు. అంతేకాకుండా రాడార్ అభివృద్ధికి ముఖ్యపాత్ర వహించాడు 15 సంవత్సరాల వ్యవధిలో ఇతడు మొత్తం 128 విద్యుత్ మరియు ఎలక్ట్రానిక్ పేటెంటులను ప్రచురించాడు.

జంతువులను దొంగతనంగా వేటాడటం అధికం అయింది. దొంగతనంగా కాజేసిన వేరావికి శిక్ష క్రూరంగా లేకపోవడమే దీనికి ముఖ్య కారణం. జంతువులను దొంగ చాటుగా చంపి వాటి చర్మాలను అమ్మి అన్యాయంగా సొమ్ము చేసుకుంటున్నారు.

అడవి జంతువులను వాటి స్వాభావిక పరిసరాలలో చూచి ఆనందించడానికి ఇప్పుడు చాలామంది సాంక్చుయరీలను సందర్శిస్తున్నారు. జంతువులు ఏ పాపం చేయలేదు. ఒక మనిషి మరో మనిషిని చంపినప్పుడు అతను శిక్షింపబడుతున్నాడు. కానీ ఆ మానవుడే ఒక సింహాన్నో, పులినో చంపితే అతడు గౌరవించబడుతున్నాడు. మృగాలు మనుష్యులకంటే హీనమైనవిగా పరిగణించబడుతున్నాయి. కానీ మానవుల అందరికంటే వాటియందు మంచి గుణాలు ఎన్నో ఉన్నాయి. అవి అందంగా సొగసుగా ఉంటాయి.

కాలుష్యంవల్ల కూడా కొన్ని జంతువులు మరణిస్తున్నాయి. ఫాక్టరీలు వ్యర్థమైన కాలుష్యపు నీటిని నదులలోకి వదులుతున్నాయి. దీనివల్ల నదులలో చేపలు నశించిపోతున్నాయి. మరణించిన చేపలను తిన్న పక్షులు మరణించకపోయినా అవి పెట్టిన గ్రుడ్లు పెరిగి పెద్దవి కావడంలేదు. ఈ విధంగా పక్షులలో సంతానోత్పత్తి నిరోధింపబడుతూంది. ప్రపంచంలో అడవి మృగాలు నశించడం మానవజాతికి అవమానకరం. మానవులు అడవి మృగాల సంరక్షణకు చేపట్టవలసిన జాగ్రత్తలను అన్నీ చేపట్టాలి.

—'అనిమల్ సిటిజన్' సౌజన్యంతో

## తీరికలేని తేనెటీగ



తేనెటీగకి మొత్తం అయిదు కళ్ళు ఉంటాయి. తలపైన మూడు సామాన్యమైన కళ్ళు, రెండు సంకీర్ణమైన కళ్ళు. వీటిలో వేలకొద్దీ అక్షికటకాలు ఉంటాయి. తేనెటీగకి 5000 నాశికాపుటాలుంటాయి. దీనికి మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న ఆపిల్ చెట్టును కూడా వాసనతో తెలుసుకోగలదు.

తీరికలేని తేనెటీగ అని చెప్పడం అతిశయోక్తి కాదు. ఒక టీ చెంచాడు మకరందం కోసం మరణశ్రమతో వారాలపాటు జీవిస్తుంది. మనుష్య ఉపయోగించే అర కిలో సీసాడు తేనెను సంగ్రహించడానికి తేనెటీగ 80,000 కి.మీ. అంటే భూగోళాన్ని రెండు సార్లు చుట్టినంతదూరం ఎగరాలి.

పువ్వులమీదికి ఎగిరి తేనెను సేకరించడం విలాసవంతమైన క్రీడ కాదు. ప్రకృతికి విధేయతగా సహజంగా జరుగుతూన్న కార్యము. విత్తనాభివృద్ధి, పంటలకోత నిరంతరం జరుగుతుంటాయి. నేడు సుమారు 1,00,000 రకాల మొక్కలు తేనెటీగల సహాయం లేకుండా ఫలదీకరణ చెందవు.

# సిగరెట్లు బీడీల బెడద

డా. సి.ఎన్. దైవనాయగం

ప్రపంచంలో ముఖ్యంగా అనారోగ్యానికి మూల కారణము సిగరెట్లు, బీడీలు కాల్చడం. దీనిని అతి సులభంగా వివరించుకోవచ్చు.

ఒరిస్సా మరియు ఆంధ్రప్రదేశ్‌లలో విస్తారంగా ప్రవృద్ధిపొందుతూన్న ఒక చెట్టు



లేత ఆకులలో ఘాటైన మెత్తటి పొగాకు పొడిపెట్టి చుట్టినవే బీడీలు

కాల్చడం మానేసిన ఒకటి రెండు రోజులలో మానవ శరీరంలో చేరిన నికోటైన్ (పొగాకులో ఉండే విషపదార్థం) బయటకు పోవడం ప్రారంభిస్తుంది. ఉన్నట్టుండి అకస్మాత్తుగా సిగరెట్లు, బీడీలు కాల్చడం మానేస్తే నికోటైన్ లేకుండా శరీరం తన పనులు తను చేసుకోడానికి సరిపెట్టుకుంటుంది. బలవంతంగా మానుకోవడానికి పట్టే కాలపరిమితి తగ్గుతుంది. ఇబ్బంది పడిపోనవసరం ఉండదు.

ఒక సిగరెట్టు 1-2 మి.గ్రా.ల నికొటైన్ 8-40 మి.గ్రా.ల లేతపసుపు ఇటుక రంగు కలిపిన తారును జనింపజేస్తుంది. సామాన్యంగా 70 మి.గ్రా. ల నికొటైన్ ఇంట్రావీనస్ ఇంజక్షన్ ఇస్తే మనిషి మరణిస్తాడు. పొగ కాల్చడం మానేసిన జనాభాలో మరణాలరేటు అద్భుతంగా తగ్గిపోతుంది.

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద క్రిస్మస్ చెట్టు

యునైటెడ్ స్టేట్స్ వాషింగ్టన్ స్టేట్‌లో సియాటిల్ అనేచోట 1950 డిసెంబరులో ఒక విపణి కేంద్రంవద్ద నిలబెట్టిన 'డగ్లస్ ఫిర్' అనే క్రిస్మస్ ట్రీ 67.36 మీటర్ల ఎత్తు ఉంది.

(38 వ పేజీ తరువాయి)

## ఒంట్లో ఉష్ణం తగ్గాలంటే

కమ్మని మజ్జిగలో రెండు చెంచాలు చక్కెర బాగా కలిపి లస్సీ తయారుచేసుకుని త్రాగండి. ఉష్ణప్రకోపం తగ్గి చాలా చలవ చేస్తుంది. ఉత్తేజకరంగా ఉంటుంది.

* * *

## జుట్టు నల్లగా ఉండాలంటే

కొందరికి వయస్సు ముదరకుండానే జుట్టు నెరసిపోతుంది. అటువంటివాళ్ళు మందార నూనెను వాడితే జుట్టు నల్లగా నిగనిగ లాడుతూ ఉంటుంది. వెంట్రుకలు రాలిపోవు. బాగా పెరుగుతాయి.

సిగరెట్టు వెలిగించి కాలుస్తూన్నప్పుడు మండుతూన్న కొసదగ్గర 880°C అంటే 1616°F ఉష్ణం జనిస్తుంది.

సిగరెట్లు కాల్చడంవల్ల కలిగే అనారోగ్యాన్ని కాపాడడానికి అమెరికాలో సాలీనా 11.5 బిలియను (11,500 మిలియను) డాలర్లు వ్యయం అవుతూంది. ప్రపంచం అంతటా పొగాకు తాగడంవల్ల ఒక మిలియను మంది అకాలమృత్యువును తెచ్చిపెట్టుకుంటున్నారని ప్రపంచ ఆరోగ్య సంస్థ వారి సమాచారం. ప్రపంచం అంతటా ప్రతీ సంవత్సరం 6,00,000 మంది క్రొత్తగా ఊపిరితిత్తుల కాన్సర్ రోగులు బయలుదేరుతున్నారు. ఇది పొగ త్రాగడంవల్ల సంభవిస్తూంది. దీర్ఘకాలిక బ్రోంకైటిస్ 75 శాతం, 25 శాతం గుండెపోటు మరణాలు పొగత్రాగడంవల్ల సంభవిస్తున్నాయి.

ప్రపంచం అంతటా సిగరెట్లు కాల్చేవాళ్ళు 85-100 బిలియన్ డాలర్ల వ్యయంతో 4000 బిలియను సిగరెట్లు కొంటున్నారు. తలసరి 1000 కంటే అధికంగా సిగరెట్లు కాలుస్తారు. భారతదేశంలో సగటున పెద్దవారు 700 గ్రాముల పొగాకును ఉపయోగిస్తారు. 300 గ్రాముల బీడీ పొగాకు. 200 గ్రాముల బాగా సన్నితంగా కత్తిరించిన పొగాకు, మిగిలినది నోట్లో నమిలే ఎండు పొగాకు. భారతదేశంలో 200-250 మిలియన్ మంది బీడీలను కాలుస్తారు. దేశంలో 25 లక్షల మంది బీడీలను తయారుచేసే కార్మికులు ఉన్నారు.

కాల్చడం అలవాటులేని ఆరోగ్యవంతులు అప్రయత్నంగా అనుకోకుండా సిగరెట్లు కాల్చడంవల్ల ఊపిరితిత్తుల కాన్సరు మరియు అనేక ఇతర అనర్థదాయకమైన రోగాలు తెచ్చిపెట్టుకుంటారు.

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద దేవాలయం - ఆంగ్‌కోర్‌వాట్


ANGKOR WAT

1861 లో ఒక ఫ్రెంచి ప్రకృతి పరిశోధకుడు హెన్రీ మొహాట్ (Henri mouhot) ఖ్మెర్ సామ్రాజ్యానికి రాజధాని ఆంగ్‌కోర్‌ను అకస్మాత్తుగా కనుగొన్నాడు. ఇది నేటి కంపూచియాలో ఉంది. ఆసియాలో ప్రసిద్ధిపొందిన బ్రహ్మాండమైన ఈ నగరం సుమారు 9-14 శతాబ్దాల మధ్య దట్టమైన అడవులు బయలుదేరాయి. ఆంగ్‌కోర్‌లో ముఖ్యమైన ఆంగ్‌కోర్‌వాట్ దేవాలయం ప్రపంచంలో మిక్కిలి బ్రహ్మాండమైనది. దీంట్లో హిందూదేవతా విగ్రహాలు, సర్పములు, రాజుల చిత్రములు, ఖ్మెర్ నాట్యకత్తెల శిల్పాలు ఉన్నాయి. దీనికి 5 గోపురాలు ఉన్నాయి. వీటిలో ఒకటి 250 అడుగుల ఎత్తు ఉంటుంది.

## బహుమతి పొందిన వ్యాసం

# తన్నుమాలిన ధర్మము మొదలుచెడ్డ బేరము

విద్వాన్ సి. వెంకటరత్నం,
కమ్మపల్లి.

'మహాత్యాగము వలన మహాకార్యములు సిద్ధించును' అని వివేకానందులు చెప్పినట్లు సమదర్శనమును సమాజంలో చూచుటకు సామాన్యులు సైతము సమస్తమూ త్యజింప లేకపోయినా తమ శక్తికి తగినట్లు ఇహ పర శ్రేయమును కోరి ఇతరులకు సహాయపడవలెను. ఒక్క ప్రాణికి సాయము చేయగలిగినచో సహస్ర పర్యాయములు కుక్కనై పుట్టుటకైనను సంసిద్ధుడవగుమని గురుదేవుడు శ్రీరామకృష్ణ పరమహంస చెప్పినారు. దానము చేయుచూ ఎవ్వడు తన చేతిని ముడుచుకొనునో వాడు అత్యల్పుడు. ఇచ్చుచు ఎవ్వడు తన చేతిని చాచునో వాడే అత్యధికుడు స్వార్థరహితమైన దేదియో అదియే ధర్మము, నీతి. స్వార్థపరమైన దంతయు అధర్మము, అవినీతి. పేరుప్రతిష్ఠల కొరకు స్వార్థముతో ఏ వ్యక్తి ధర్మకార్యానికి పూనుకోరాదు. అట్లు పూనుకొన్నచో తన పూర్వపుణ్య ఫలం వ్యర్థమగును. ఇతర ప్రాణులకు లేని వివేకము విశేషావకాశము మానవునికి లభించింది. మొదట తను జీవించి, ధర్మార్థ కామ మోక్షములను ఆచరించాలి.

వలలో తగులుకున్న పావురములను పావురములకు రాజైన చిత్రగ్రీవుడు తన మిత్రుడగు హిరణ్యకుని విడిపింపమని కోరగా హిరణ్యకుడు (మూషికరాజు) చిత్రగ్రీవుని బంధములు మాత్రము త్రెంచెదనని తెలుపుతూ తన్నుమాలిన ధర్మము మొదలు చెడ్డ బేరము సుమా! తన్నుమాని ఇతరులను రక్షింపమనడం నీతికాదు అని హిరణ్యకుడు చెప్పగా: బుద్ధిమంతులు తమ జీవితమునైనను త్యజించి, ఇతరులకు కలిగిన కీడును తొలగింప పూనుకొనవలెనని నీతికోవిదుల వాక్యముగా చిత్రగ్రీవుని ద్వారా చిన్నయసూరి చెప్పించెను.

### 'ఒకాపి' ఆఫ్రికా దేశపు జంతువు




'ఒకాపి' ఆఫ్రికాదేశంలో నివసించే ఒక జంతువు. జిరాఫీలా ఉన్నా మెడ పొట్టిగా ఉంటుంది.

శరీరము క్షణికము, గుణములు కల్పాంత స్థాయులు అని శరీరమునకు, కీర్తికిగల అంతరమును తెల్పినప్పుడు కర్మఫలితమును దలంచి చింతించిన హిరణ్యకుడు చిత్రగ్రీవునితో పాటు తక్కిన పావురములను కూడా వలనుండి విడిపించెను.

చిత్రగ్రీవ హిరణ్యకుల మైత్రి లోకమునకు ఆదర్శమగునట్లు బుద్ధిమంతులు పెక్కుమంది మంచి మిత్రులను సంపాదించుకొందురు. అనెడి నీతిని సూరి మన కందించిన చక్కని సందేశం.

• • •

సి. మోహనరావు, శ్రీకాళహస్తి.

'తన్నుమాలిన ధర్మం మొదలుచెడ్డ బేరం' అనే లోకోక్తిని మనం సహజంగా వింటున్నాము. అంటే తనకు మాలినధర్మం పనికిరాదని అర్థము. కానీ మన వేదాలలో, మహాభారత రామాయణాదులలో తనకుమాలిన ధర్మం చేసినవారినే ఉదాహరణలుగా చూపబడ్డారు.

తన శరీరాన్ని అగ్నికి అర్పణ గావించి ఇంద్రునికి వజ్రాయుధం చేకూర్చిన దధీచి, అల్పప్రాణి పావురంకొరకు స్వశరీరాన్ని ఖండించుకున్న శిబి, సర్పముల ప్రాణరక్షణకై సజీవ ఆహారంగా మారిన జీమూతవాహనుడు, భాతృవాత్సల్యంతో అరణ్యవాసం కావించిన లక్ష్మణుడు మొదలైన వారెందరో ఆదర్శమూర్తులుగా నిలిచినట్టి వారు జన్మించిన భారతావనిలోనే ఈ సూక్తి వైరుధ్యంతో భారతీయ ధర్మసూక్ష్మ రహస్యానికి ఒక ఉదాహరణ మాత్రమే.

ధర్మమును అనుసరించడం ప్రతివాని ధర్మము. ధర్మాన్ని నీవు కాపాడు. ధర్మం నిన్ను కాపాడుతుంది. దీనినే "పెట్టిన దినముల లోపల నట్టడవులకైన వచ్చు నానార్థంబుల్" అని సులభమార్గంలో చెప్పారు.

ధర్మం దేశ కాల పరిస్థితులను బట్టి మార్పుచెందే ఒక స్థిరత్వం లేని భావన. ఒకనాటి ధర్మం నేడు అనుసరణీయం కానిదిగా కూడా గోచరిస్తుంది. ధర్మంకోసం రాజ్యాన్ని, ధర్మపత్నిని వదల్చుకోడానికి శ్రీరాముడు సిద్ధపడితే నేడు పదవికోసం ధర్మాన్ని వదలుకునే నాయకులున్నారన్నా అతిశయోక్తిలేదు. వ్యక్తిగతమైన భావనలే ధర్మాలుగా మార్పు

## లతామంగేష్కర్ 30,000 పాటలు పాడింది



1948-1987 సం॥ల మధ్య 'నైటింగేల్ ఆఫ్ ఇండియా' అని చెప్పబడే లతామంగేష్కర్ సోలో, డ్యూయెట్‌లు, కోరస్ పాటలు సుమారు 30,000 ఇరవై భాషలలో పాడింది. ఈమె రోజుకు ఆయిదుపాట్ల సమావేశమై మొత్తం 2,000కు పైగా సినిమాలకు పాడింది. లండన్‌లో ఆంగ్లేయులు ఈమెను భారతీయ సంగీతానికి ప్రతినిధిగా గౌరవించారు.

పొందుతున్న ప్రస్తుత సామాజిక పరిస్థితులలో 'తన్నుమాలిన ధర్మం మొదలుచెడ్డ బేరము' కాగలదని పలికిన కాలజ్ఞానుల పలుకులు అక్షరసత్యాలు.

* * *

కుమారి సి. అపర్ణ, తెనాలి.

'చెప్పేవి ధర్మపన్నాలు చేసేవి చెడ్డ పనులు' అనే సామెత నేడు చాలామందికి అన్వయిస్తుంది. ఏదైనా ధర్మబోధ చేసేటప్పుడు ముందుగా తానది ఆచరించి ఇతరులకు చెప్పగలగాలి. శ్రీరామకృష్ణుడు తన బిడ్డచేత తీపి మాన్పించమని కోరిన తల్లిని పదిరోజులు తరువాత రమ్మని, ఆ తరుణంలో తను తీపి తినడం మాని ఆ తరువాత మాత్రమే ఆ పిల్లవాడికి తీపి తినిపించవద్దని హితం చెప్పగలిగాడు. అందుకే ఆయనను పరమహంస అన్నారు. జాతిపిత మహాత్మా గాంధీ కూడా ఈ సత్యాన్ని త్రికరణశుద్ధిగా ఆచరించిన వారిలో ఒకరు.

అదేవిధంగా ఏదైనా వస్తువును మనం కొనుగోలు చేసేటప్పుడు దాని గుణ విచక్షణ చేసి, దాని వెలను బేరమాడటం మంచి లక్షణం. కానీ నోటికి వచ్చిన ధరకు అడగడం మన వైరితనాన్ని సూచిస్తుంది. జూదమాడుతూ ఇతరులను ఆడవద్దని బోధించడం ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో, కొనడం చేతకాక బేరం ఆడటం అంతే కాబట్టి పై లోకోక్తి పుట్టింది.

కానీ తెలిసీ తెలియనివారు దీనిని స్వార్థత్వానికి అన్వయిస్తారు. ముఖ్యంగా పదవులలో ఉన్నవారు ముందు తమ బాగు చూసుకుని ఆ తరువాత ఇతరులను గురించి ఆలోచించడం గమనించవచ్చు. నీవు బాగా ఉంటే నీ చుట్టూ ప్రపంచం బాగా ఉంటుంది అనడంలో ఏదైనా సామరస్యం ముందు నీలో పెంపొందింతుకోమనేగాని నీవు మాత్రమే బాగుపడమని కాదు.

అందుచేత మనం ముందుగా మనలను గురించిన విచక్షణ వివేకం కలిగి ఉండి, సంఘంలో నలుగురినీ సన్మార్గంలోకి మార్చడానికి ప్రయత్నించాలి.

## దీనిమీద పన్ను విధించే అవకాశం ఉండవచ్చు!


FARADAY

గొప్ప బ్రిటిష్ విజ్ఞానవేత్త మైకేల్ ఫారడే ఒక సభలో ఎలక్ట్రిక్ ట్రాన్స్‌ఫార్మరు, డైనమో గురించి ముఖ్యవిషయాలను వివరిస్తూండగా బ్రిటిష్ ముఖ్య ప్రధాన మంత్రి గ్లాడ్‌స్టన్ లేచి అసలు దీనివల్ల లాభం ఏమిటీ? అన్నాడు. వెంటనే ఫారడే 'దీనిమీద కూడా మీరు రేపు పన్ను విధించవచ్చు' అన్నాడు.

# పోటీలు

మార్చి 1989

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొనవచ్చు. ఏ ఎంట్రీకాఎంట్రీ విడిగా పావుఠావు సైజుకు తగ్గని కాగితంమీద వ్రాయాలి. ప్రతీ ఎంట్రీమీద అడ్రసు ఉండాలి. ఒకే కాగితంమీద ఒకటి కంటే ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 15 లు, రూ.10 లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకే సారి ఎన్ని ఎంట్రీలయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: మార్చి 20, 1989. పంపవలసిన చిరునామా : పోటీల నిర్వాహకుడు, తెలుగు 'విస్డమ్' 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004.

— సంపాదకుడు

## వ్యాసం

"కులవిచక్షణ" అనే అంశం మీద 200 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. భారతదేశానికి దక్షిణాభి ముఖంగా ఉన్న కొన (Southern most tip of India) :

(ఎ) కన్యాకుమారి, (బి) తిరువనంతపురం, (సి) లక్షద్వీపము, (డి) అండమాన్, నికోబార్ ద్వీపములు.

2. వచ్చే ఒలింపిక్ క్రీడలు ఇక్కడ నిర్వహింపబడతాయి:

(ఎ) ఏథెన్స్, (బి) చికాగో, (సి) బార్సిలోనా. (డి) బీజింగ్.

3. క్రిందివాటిలో SAARC సభ్యత్వము కలిగియున్నది:

(ఎ) మాల్దీవులు, (బి) బర్మా, (సి) మలేషియా, (డి) సింగపూర్.

4. ఇటీవల వివాదానికి గురైన వృక్షం ఏది?

## నవ్వు నవ్వు పుట్టిస్తుంది



నవ్వు నవ్వుని పుట్టిస్తుంది. ఒకరిని చూసి నువ్వు నవ్వితే ఇంకొకరు నిన్ను చూసి నవ్వుతారు. ఒక నవ్వు రెండు నవ్వులు అవుతాయి. నవ్వు ఇంత సంతోషాన్ని తెచ్చిపెడుతుంది కాబట్టి మనం అంతా నవ్వుతూ ఉందాం ప్రతిచోటా నవ్వు వికసించేదాకా.

(ఎ) కొబ్బరిచెట్టు, (బి) యూకలిప్టస్, (సి) వెదురు (డి) సోయాచిక్కుడు.

5. OPEC అనేది :

(ఎ) పెట్రోలియం ఎగుమతిచేసే దేశాల సమూహం. (బి) పెట్రోలియం ఎగుమతి చేసే కంపెనీల సమూహం, (సి) నూనె మరియు పెట్రోలియం ఎగుమతిచేసే కార్పొరేషన్స్ (డి) నూనె మరియు పెట్రోలియం ఎగుమతిచేసే దేశాలు.

6. స్వాతంత్ర్యం తరువాత భారతదేశ ఐక్యతకు కారకు లెవరు?

(ఎ) వల్లభాయిపటేల్, (బి) సి. రాజగోపాలాచారి. (సి) జవహర్‌లాల్ నెహ్రూ, (డి) జాన్ మథాయ్.

7. సుమారు బి.సి. 3000 లో మానవ నాగరికత ఇక్కడ ఉంది:

(ఎ) ఇండియా, (బి) ఆస్ట్రేలియా, (సి) అమెరికా, (డి) ఎక్కడాలేదు.

8. ఆపరేషన్ ఫ్లడ్ II దేనికి సంబంధించింది?

(ఎ) పాల ఉత్పాదన, (బి) పంజాబు గ్రామములనుండి తీవ్రవాదులను రూపుమాపుట, (సి) వరదల నివారణ, (డి) పన్నులు ఎగవేసిన వారిపై దాడి.

## పజిల్



ఆధారాలు - అడ్డం: 1. స్త్రీల పేర్లకు గౌరవ సూచకముగా ముందు వ్రాయబడే పదము, 3 ఒక పవిత్రమైన నది పేరు. 6. మరణానికి ఔషధం లేకపోయినా దీనికి ఔషధం ఉంది, 7. పక్షి అను అర్థమిచ్చే మాటలో చివరి రెండు అక్షరాలు తారుమారైనాయి, 9 వేల్పులు నలుగురుకాదు. 10. వెలితి, 11. ఆకాశమార్గము, 13. నూనె మొదలగు స్నేహద్రవ్యము, 15. సంగీతంలో స్వరవిన్యాస భేదాలు, 18. స్త్రీలు ధరించేది - మొదటి రెండు అక్షరాలు తారుమారైనాయి, 20. దగాకోరు. 21. వార్తలు పంపుకోడానికి ఉపయోగించే పక్షులను సూచించే మాటలో అక్షరాలు తారుమారైనాయి, 22. బియ్యము మొదలగు వాటిని తిరగలిలో పిండిచేయుట.

నిలువు: 1. ఒక సంవత్సరము పేరు, 2. మరల. 3. చినిగిన బట్టలతో కుట్టిన బొంతలతో చేరిన బాట, 4. 'భూచరము కాదు' మాటలో మూడవ, అయిదవ అక్షరాలు తారుమారైనాయి, 5. కాలుష్యమైన జలము అని అర్థమిచ్చే మాటలో రెండు మూడు అక్షరాలు తారుమారైనాయి, 8. ఒక శాకా విశేషము, 11. నల్లమందుకు మూలద్రవ్యము, 12. పదహారవ వంతు భాగము, 14. లేత కాదు 16 'కమలాక్షు నర్చించు___ కరము', 17. స్వరరాగాలతో పాడుటకు

విలుగా ఉంటాయి క్రిందినుంచి పైకి, 18. విస్తారము, 19. సమాచారమునకు హిందీ పదము.

## తెలివికి పరీక్ష

1. 'కావిచోట అనరాదు' ఏమి కావిచోట, ఏమి అనరాదో పూర్తిగా వ్రాయండి.

2. ఈ వరుసలో ఇమడని సంఖ్య ఏది?

7, 9, 13, 19, 27, 38, 49.

3. ఇంకా సమాజంలో కుల వివక్ష పోలేదు, హత్యలవంటి ఘటనలు జరుగుతున్నాయి. అనే వాక్యాన్ని తప్పులుంటే సరిదిద్ది వ్రాయండి.

4. తెలుగు నిఘంటువులో ఈ క్రింది మాటలు ఏ వరుసలో ఉంటాయి?

క్రొన్నన, క్రొవ్విరి, క్రొమ్ముడి, క్రొత్తావి.

5. క్షేత్ర గణితంలో రెండు రేఖలు కలియు చోటును ఏమంటారు?

6. రెండవ వరుసలో ఇచ్చిన పదములను మొదటి వరుస వాక్యములతో జతపరుచుము.

1. విష్కాముడై విహిత కర్మములను ఆచరించువాడు — కర్మశూరుడు

2. క్రియయందు సమర్థుడు — కర్మిష్ఠుడు

3. పూనిన కార్యమును పాటుపడి నెరవేర్చువాడు — కర్మాత్ముడు

4. కర్మబద్ధుడగు జీవుడు — కర్మయోగి

7. క్రింది వాక్యములలో 'కాజేయు' వ్యవహారరీతిలో ఎట్లు ఉపయోగింపబడుచున్నది?

(ఎ) రంగయ్య పిత్రార్జితం అంతా కొల్లగొట్టుకున్నాడు.

(బి) నా సొమ్ము వాడు అపహరించాడు.

(సి) ఆ పని ముగింపును త్వరగా రావాలి.

### విసదమ్ పోటీల కూపను మార్చి 1989

### భారతదేశంలో 2,23,000 టన్నుల ద్రాక్ష పండింపబడుతూంది



భారతదేశంలో సుమారు 12,000 హెక్టేరులలో పాటినా 2,23,000 టన్నుల ద్రాక్ష పండింపబడుతూంది. ద్రాక్ష సాగుబడి దక్షిణ మరియు పశ్చిమ ఇండియాకే పరిమితమైంది.

## విసిడమ్
## పోటీల కూపను
## మార్చి 1989

(డి) తల్లిలేనప్పుడు ఇంట్లో పిల్లలంతా పళ్ళెంలో జిలేబి పూర్తిగా తినేసారు.

8. ఒక తల్లి వయస్సు 40 సంవత్సరాలు. అప్పుడు ఆమె కుమార్తెకు 13 సంవత్సరాలు ఉంటే ఎన్ని సంవత్సరాలకు ముందు తల్లి కూతురికంటే నాలుగురెట్లు పెద్దదిగా ఉంటుంది?

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను సూచించండి.

1. విచక్షణ: సూక్ష్మదృష్టి (ఎ), నేర్పరితనము (బి), పాండిత్యము (సి), వివేకము (డి).

2. సవతు: సామ్యము (ఎ), విధము (బి), ఖ్యాతి (సి), జాడ (డి).

3. సవర: అందమైనది (ఎ), ఒక జాతి పేరు (బి), స్త్రీలు కొప్పును ముడుచుటలో ఉపయోగించే వస్తువు (సి), సిద్ధము (డి).

4. వివక్ష: చెప్పనిచ్చ (ఎ), ఇచ్చ (బి), అర్థము (సి), ఉద్దేశము (డి).

5. కమ్మన: కమ్మదనము (ఎ), మాధుర్యము (బి), సువాసన (సి), కమ్మరీడు (డి).

6. కనుకట్టు: గంత (ఎ), ఇంద్రజాలము (బి), దృష్టిదోషము (సి), భయము (డి).

7. గంటు: ముడి (ఎ), గాయపరచు (బి), గరిటె (సి), కూరుడు (డి).

8. గుజ్జు: పొట్టివాడు (ఎ), చిక్కనిది (బి), పూలగుత్తి (సి), రహస్యము (డి).

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా 15 మాటలకు మించకుండా చమత్కారమైన వ్యాఖ్య వ్రాసిపంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకం బహుమతి.

## మీరైతే...?

'ప్రయోగం ఫలించాలి' అంటే మీరు ఏం అంటారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## మాయ పొరను తొలగించుకో

పాచిపట్టిన కోనేటిగట్టు నుండి చూస్తున్నప్పుడు అందులో నీరున్నట్లే మనకు కనిపించదు. నీటిని చూడాలంటే పాచిని తొలగించాలి. మాయావృతమైన కన్నులతో జూచుచు భగవంతుడు కనిపించడం లేదనుకుంటాము. భగవంతుని జూడదలిస్తే మాయ పొరను తొలగించుకో.

—శ్రీరామకృష్ణుడు

# పోటీలు - ఫలితాలు

(జనవరి 1989)

వ్యాసం - విజేతలు - మొదటి బహుమతి: సి మోహన్‌రావు, శ్రీ కాళహస్తి, (చిత్తూరు జిల్లా); రెండవ బహుమతి: బి. ఎస్. మూర్తి, కాకినాడ; మూడవ బహుమతి: పంతుల దక్షిణామూర్తి ప్రసాద్, విజయనగరం.

క్విజ్ - జవాబులు: 1. (బి) విజయనగర సామ్రాజ్య స్థాపకుడు, 2. (సి) మాండ్వి, 3. (డి) విమ్మ, 4. (బి) కె. ఎమ్. కరియప్ప, 5. (డి) పాంక్రియాస్, 6. (సి) లెబనాన్, 7. (డి) బోధనా పద్ధతులలో అభివృద్ధి, 8. (ఎ) మిటమిను A.

విజేతలు - మొదటి బహుమతి: ఎ. సుభాషిణి, వరగలి, (నెల్లూరు జిల్లా); రెండవ బహుమతి: సి. కె గోపాల్, పెనుకొండ, (అనంతపూర్ జిల్లా); మూడవ బహుమతి: మాకినేడి వీర వెంకట సత్యనారాయణ, జట్నీ, (ఒరిస్సా).

పజిల్ - జవాబులు - అడ్డం: 1. శ్రీకరము, 3. శ్రీరాగము, 5. మనువు, 6. అలు, 7. ముసురు, 9. తములములు, 11. వరి, 12. మమునవ, 13. కమురవ, 15. దేవుడు, 16. ముదిలత, 17. రమ్యముగా.

నిలువు: 1. శ్రీకారము, 2. మునులు, 3. శ్రీపురము, 4. మురువులు, 6. ఆరు, 8. సుమము, 9. తరి, 10. లగ్నము, 11. వనదేవత, 12. మచ్చరము, 13. కడుపార, 14. నగదుగా.

విజేతలు - మొదటి బహుమతి: టి. ఆర్. చంద్రుడు, రాజమండ్రి; మూడవ బహుమతి: టి. వి. కామేశ్వరి, బొరుభద్ర, (శ్రీకాకుళం జిల్లా).

తెలివికి పరీక్ష - జవాబులు: 1. (ఎ) ఆర కాగిన పాలు కమ్మన, (బి) ఆర పండిన పండ్లు తీపి, (సి) కడుపార తిన్నవానికి ఆకలి ఉండదు, (డి) కనులార చూచి లేదంటావేమి?. 2. మోకాళ్ళు, పాద

## నమ్మలేని నిజాలు

### ఢిల్లీ నుంచి కాన్పూరు చేరడానికి ఒక కార్డుకి 8 సంవత్సరాలు పట్టింది!:

ఉత్తరప్రదేశ్ కాన్పూర్ నుండి ఢిల్లీ చేరడానికి ఒక కార్డుకి 8 సం. లు పట్టింది. కాన్పూరులో జూన్ 22, 1978 న ఒక వ్యక్తి తన సోదరికి తాము ఢిల్లీ నుంచి కాన్పూరు చేరిన క్షేమవార్తను తెలియజేస్తూ దీనిని వ్రాసాడు.

• • •

### ఎఫిల్ టవర్‌ను 3 నిమిషాల 12 సెకండ్లలో ఎక్కగలిగాడు:

1905 లో ఒక వ్యక్తి 729 మెట్లు గల ఎఫిల్ టవర్‌ను 3 నిమిషాల 12 సెకండ్లలో ఎక్కాడు.

ములు, చేతులు, రొమ్ము, బుద్ధి, తల, మాట, చూపు, 3. జయదేవుడు-అష్టపదులు, 4. ఏ చిత్తము నా భాగ్యము. 5. 65, 6. (ఎ) నాలుగు డబ్బులు చేరగానే వాడికి అప్పుడే తల తిరిగింది, (బి) ఈ వేళ పండుగ కావున శ్రీనాథుడు తలకు పోసు కున్నాడు, (సి) ఆఖరి కూతురి పెళ్ళిచేసి తండ్రి తల తడిమి చూసుకున్నాడు, (డి) చంద్రుడు నలుగురిలో తల త్రిప్పుకొను చున్నాడు. 7. గుప్తుల కాలంలో కుమార గుప్తునిచే. 8. (ఎ) జబర్‌దస్తు, (బి) బేజారు, (సి) బందోబస్తు (డి) అదాలత్.

విజేతలు - మూడవ బహుమతి: తెంబూరుగావం, కొరసంద, (ఒరిస్సా).

మాటల మహిమ - జవాబులు: 1. పట్టిది (ఎ), కేవలము (బి), అసత్యము (సి); 2. బాధ (ఎ), సంతాపము (బి); 3. బాధ (ఎ). దుఃఖము (బి). హాని (సి), అపవాదము (డి); 4. భార్య (ఎ), స్త్రీ (బి); 5. మిక్కిలి వేగము (ఎ), పరా క్రమము (బి); 6. కాలక్షేపమగు (ఎ); 7. కోమలము (ఎ), అభినవము (బి), స్వల్పము (సి); 8. అర్ధముగా జూచు (ఎ), పట్టు (బి), ఒడ్డు (సి), నిల్పు (డి).

విజేతలు - రెండవ బహుమతి: పి. వి. వి. ఎస్. సీతారామయ్య, విజయవాడ.

ముఖచిత్ర వ్యాఖ్య - రెండవ బహుమతి: పి. జగదీష్, విశాఖపట్నం; మూడవ బహుమతి: కర్రి క్రిష్ణమ్మ, వీరఘట్టం, (శ్రీకాకుళం జిల్లా).

పాఠకుల అభిప్రాయాలు - రెండవ బహుమతి: సీల శ్రీనివాస్, మిరుదొడ్డి, (మెదక్ జిల్లా); మూడవ బహుమతి: సి. మోహన్‌రావు, శ్రీకాళహస్తి, (చిత్తూరు జిల్లా).

మీరైతే...? - మొదటి బహుమతి: సీల శ్రీనివాస్, మిరుదొడ్డి, (మెదక్ జిల్లా); మూడవ బహుమతి: బి. ఎస్. మూర్తి, కాకినాడ.

## సౌందర్యం అంటే ఏమిటి?



సౌందర్యం అత్యల్ప కాలపు క్రౌర్యం అని సోక్రటీస్ అభివర్ణించాడు. సౌందర్యం ప్రకృతి ప్రసాదించిన విశేషాధికారం అన్నాడు ప్లేటో. సద్గుణలేని వంచనగా వర్ణించాడు థియోఫ్రాస్టస్. థియోక్రిటస్ సంతోష వంతమైన దుఃబిమానం అన్నాడు. ఏకాంత సామ్రాజ్యం అని కార్నియేడ్స్ పొగిడాడు. ప్రపంచంలో ఉత్తమ సిఫారసులను మించినది అని అరిస్టాటిల్ అంటే హోమర్ ప్రకృతి ప్రసాదించిన మహాద్భుతమైన కానుక అన్నాడు. దేవతలు ఇచ్చిన దుగ్మత అని ఓవిడ్ వివరించాడు.